శ్రీరస్తు



# అన్యవాదకోలాహలము

## లఘుటీక



చెన్నపురి

స్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

 [*Price Re.* 0-12-0]

# పద్యకావ్యములు

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | | 0 | 12 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) | ... | 6 | 0 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు | ... | 15 | 0 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్ద ప్ప | ... | 1 | 8 |
| ,, టీక | ... | 4 | 0 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| ఆంధ్రనామసంగ్రహము, పద్యకావ్యము | ... | 0 | 3 |
| ,, టీకతో (బ్రౌను పేపరు) | ... | 0 | 8 |
| ,, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు కలిసి | ... | 2 | 0 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 1 | 0 |
| ఉత్తరరామాయణము. చక్కనికూర్పు | ... | 6 | 0 |
| ఉత్తరహరివంశము | ... | 3 | 0 |
| కవిత్వతత్త్వవిచారవిమర్శనము | ... | 1 | 8 |
| కవిరాజమనోరంజనము | ... | 1 | 4 |
| కృష్ణదండకము | ... | 0 | 2 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 8 |
| కాశీఖండము | ... | 3 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 6 |
| డిటో గట్టుప్రభువుకృతము | ... | 0 | 8 |
| కుమారసంభవము, నన్నెచోడకృతము | ... | 5 | 0 |
| గజేంద్రమోక్షము, సటీక | ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామాత్యునిది | ... | 0 | 12 |
| గద్యపద్యసంగ్రహము. విద్వాన్ జ. సే. సుబ్రహ్మణ్యశర్మగారిది. | | 0 | 12 |
| ,, గొత్తి సూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 0 | 12 |

శ్రీరస్తు

# అన్యవాదకోలాహలము

## లఘుటీక



చెన్నపురి:
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే.
ప్రకటితము

# పీఠిక

తెనుఁగున వీరశైవవాఙ్మయమునకు సంబంధించిన యీ లఘుకృతిని శైవగ్రంథముల మాముద్రణాలయమున నచ్చువేయించినవారును మాకుమిత్రులును నగునెల్లూరుజిల్లా ఇందుకూరుపేట గ్రామవాసులు కీర్తిశేషులు శ్రీగంగపట్టణపు సుబ్రహ్మణ్యదేవరగా రిచ్చిరి. ఇది "ఏకామ్రగురుచిత్తనలిన భృంగ సోమనాథలింగ" అనుమకుటముగల యొక శతకము. ఈ శతకమున విశేష మేమనగా, నిందులో శైవకవిసార్వభౌముఁడగు పాల్కురికి సోమనారాధ్యుని గ్రంథములనుండి, శైవమతోద్ధారకములైన ప్రమాణములన్నియు గైకొనబడినవి. అందలి వాక్యము లిందులో యథాతథముగా నున్నవి. గ్రంథకర్తయే దీనిని "పాల్కురికయ్య ప్రబంధంబులన్నియు పెట్టినయొడికంపుపెట్టె యనగ" యని 108 పద్యములో చెప్పియున్నాఁడు.

ఈశతకమునందు 109 సీసపద్యములు కలవు. సీసపద్యములకు ఆటవెలదులే యుండుట విశేషము. ఈపద్యములు వేమన మొదలగు కవు లనుకరించినట్లీ క్రిందిపద్యపాదములవలన తెలియుచున్నది.

> తలబోడియైనను, తత్త్వజ్ఞుఁడేనియు
> తలబోడిపడుచు తత్త్వజ్ఞులాతె

అనునది

> తలలుబోడియైన తలపులుబోడులా
> విశ్వదాభిరామ వినురవేమ.

అని వేమన అనుకరించినాఁడు. ఈశతకమువలన పాల్కురికి సోమనాథునివృత్తాంతముకూడ చాలఁగా తెలియఁగలదు.

దీనిని రచియించినకవి యెవరో యింతవఱకు తేలలేదు. ఈగ్రంథమును మొదట సం॥ 1884 లో ఏడునూతుల ముత్తయ్యగారుశైవరత్నాకర ముద్రాక్షరశాలలో ముద్రించునప్పుడు దీనిని శివయోగీంద్రవిరచితమని వ్రాసిరి. శతకకవులచరిత్ర 30 వ పుటలో దీనికర్త సోమేశ్వరారాధ్యులని కలదు. మాకు చూడగా ఏకామ్రనాథుడు దీనికి కర్తయని తెలియుచున్నది. ఏకామ్రనాథుడే యేకోరామనాథుడు. ఈతడు పాల్కురికి సోమనాథునిశిష్యుడైనట్లు స్థానికచరిత్రలు తెలుపుచున్నవి. కాబట్టి కవియే తన్నుతా సంబోధించుకొనునాచారమునుబట్టి, వేమన మొదలగువారివలె వ్రాసికొనియుండును. ఏకో రాముడు చాల ప్రసిద్ధుడైనశైవాచార్యుఁడు. ప్రస్తుతము మల్లంపల్లివారికి మూలపురుషుఁడు.

వీరశైవమతమునకు విశిష్టమైనవాఙ్మయ మున్నది. అందులో నొకటియగు పైగ్రంథమును, అందఱికి సుబోధకముగ నుండుటకు టీకకూడ వ్రాయించితిమి. ఇంకను ద్విపద బసవపురాణాది వీరశైవగ్రంథముల త్వరలో ముద్రించుచున్నాము. గానవాయాగ్రంథములలో నీగ్రంథ విషయము విస్తరింపగలము. వీరశైవమతతత్త్వమును సులభముగా తెలియఁజేయు నీగ్రంథము నాంధ్రమహాజను లాదరింతురుగాత!

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీశివాయగురవేనమః.

# అన్యవాదకోలాహలము



సీ. శ్రీగురులింగసంచితదయావిస్ఫూర్తి
శరణైకవర్తి విస్ఫారకీర్తి
విరహితాశాబంధుఁ బరతత్త్వసంబంధు
హర్షసుధాసింధు నార్తబంధు
శరణాగతత్రాణు సద్భక్తకళ్యాణు
మహితప్రవీణు నిర్మలధురీణు
వేదార్థనిస్సీము విశ్రుతగుణధాము
శోభనోద్దాము భక్తాభిరాము

ఆ. నిన్ను నాశ్రయించి నెఱి 'నన్యవాదకో
లాహలంబు' వేదలాలితముగ
నే నుపన్యసింతు నేకామ్రగురుచిత్త
నలినభృంగసోమనాథలింగ! ౧

లఘుటీక. శ్రీగురులింగ = శక్తితోఁగూడిన గురుస్వరూపమున లింగమైనవాఁడా! శరణైకవర్తి = శివభక్తులందు ముఖ్యముగ నుండువాఁడు! విరహితాశాబంధు = ఆశాపాశములేనివాఁడు, పరతత్త్వసంబంధు = పరమశివుని యథార్థస్వరూపము నెఱిఁగినవాఁడు, హర్షసుధాసింధు = ఆనందసముద్రుఁడు, మహితప్రవీణు = పూజ్యులైనవారిలో ఉత్తముఁడు, వేదార్థనిస్సీము = మేరలేనివేదార్థమును దెలిసినవాఁడు, శోభనోద్దాము = అఖండమైనమంగళములను గూర్చువాఁడు, నెఱిన్ = రమ్యముగ, వేదలాలితముగ = వేదము

లకు సరిపడునట్లుగ, ఏకామ్రగురుచిత్తసలిలభృంగ = ఏకామ్రనాథ. తను గురువు చిత్తమనెడి పద్మమున తుమ్మెదయై విహరించువాఁడా !

ఈకవి అన్యవాదకోలాహలమను ఈగ్రంథమును గురులింగరూపుఁడైన పాలకురికి సోమనాథున కంకితముసేయుచు, సోమనాథుని లింగరూపునిగ భావించియున్నాఁడు. ఈ అన్యవాదకోలాహలమును వేదార్థములందలి విశేషములతోఁగూడి పరమశివుని పరతత్త్వము ప్రతిపాదించునట్లుగా రచించుచుంటి నని కవి తెలిపియున్నాఁడు.

సీ. 'బసవపురాణ' ప్రబంధంబు మీరు ర
చించినయభినవశ్రీనుతించి
మీ రర్థి శ్రీ'పండితారాధ్యచరితంబు'
చెప్పిన నిరుపమస్థితి నుతించి
మీరు 'చతుర్వేద సారంబు' చేసిన
మహితపాండిత్య సమ్మతి నుతించి
'బసవరాజీ'యాది బహుకృతుల్ మీరు ని
ర్మించినసామర్థ్య మే నుతించి
ఆ. రసికతత్త్వభావ రతి నన్యవాదకో
లాహలంబు వేదలాలితముగ, నే... ౨

పాలకురికిసోమనాథుఁడు బసవపురాణము, పండితారాధ్యచరితము, చతుర్వేదసారము, బసవరాజీయము మొదలగుగ్రంథములను రచించెననియు, తాను వానినన్నిటిని అవగతముచేసికొని ఈగ్రంథమును చెప్పుచుంటి ననియు కవి అనినాఁడు.

సీ. భవదీయసంబంధబంధురం బయ్యె నే
భాగ్యంబుఁజేసెనో పాలకురికి

భవదంఘ్రిపూజనాపరులకి మ్మయ్యె నే
భాగ్యంబుఁ జేసెనో పాలకురికి
యుష్మద్విహారసంయుక్తమై వెలసె నే
భాగ్యంబుఁ జేసెనో పాలకురికి
యుష్మదీయాశ్రమాత్యున్నతిఁ బొందె నే
భాగ్యంబుఁ జేసెనో పాలకురికి
ఆ. పాలకురికి యెట్టి భాగ్యంబుచేసెనో
నీస్వనామపూర్వనిహిత మయ్యె
నీహితానుషంగ...లింగ. 3

టీ. భవదీయసంబంధబంధురంబు = మీసంబంధముచే అందమైనది, భవదంఘ్రిపూజనాపరులకు = మీపాదమును పూజించుటయందు ఆసక్తిగల వారికి, ఇమ్ము = స్థానము, ఉనికిపట్టు. యుష్మద్విహారసంయుక్తమై = మీవిహారముతోకూడినదై, నీస్వనామపూర్వనిహితము = మీపేరునకుఁ బూర్వమందు కూర్పఁబడినది. పాలకురికి = పాలకురికి యను గ్రామము, సోమనాథుని యింటి పేరు ఆగ్రామనామ మగుటచే కవి యీతీరున వర్ణించినాఁడు.

సీ. బసవయ్య నాచన్న బసవయ్య నిజలింగ
చిక్కయ్య కక్కయ్యఁ జిత్తగించి
మాచయ్య సవరద నాచయ్య కలికేత
బ్రహ్మయ్య బొమ్మయ్యఁ బ్రస్తుతించి
వేమయ్య నేకాంతరామయ్య బల్లేశు
మల్లయ్య నల్లయ్య మది భజించి
హొన్నయ్య మేదర చన్నయ్య శివరాత్రి
సంగయ్య వంకయ్య సన్నుతించి

తే. కోరి యన్యవాద కోలాహలం బను
 సీసశతక మింపు చిగురులొత్త, నే... ४

ఈపద్యమున శివభక్తాగ్రేసరుల నందఱను నుతించి యీ సీసశతకమును రచించుచున్నట్లు ప్రతిజ్ఞ యొనర్చినాఁడు.

సీ. ఆరాధ్య దేవర నతిభక్తిఁ గీర్తించి
 యనఘుమంచన పండితయ్యఁ గొలిచి
షోడ్డల బాచయ్య సుముఖుగాఁ బ్రార్థించి
 గోవిందభట్టారకుని భజించి
జ్ఞాన సంబంధుఁ బ్రసన్నుఁగా నుతియించి
 బిబ్బ బాచయ్య సంప్రీతిఁ దలఁచి
కెంబావి భోగయ్య కీర్తన గావించి
 నంబెన్న నేప్రొద్దు నాశ్రయించి
ఆ. వలను మెఱసి యన్యవాదకోలాహలం
 బనెడి సీసశతక మతిశయిల్ల, నే... ౫

సీ. కర్మవాదంబెల్ల గజిబిజిచేసిన
 కాటకోటయ్య సత్కారుణఁజేసి
జైనవాదం బెల్లఁ జిట్టుముట్టాడిన
 దాసి దేవయ్య సత్కారుణఁజేసి
కాలవాదంబెల్ల కల్లగాఁజేయు మా
 ర్కండేయ మౌని సత్కారుణఁజేసి
యన్యవాదంబెల్ల యదటణఁగించిన
 హరగణోత్తముల సత్కారుణఁజేసి
ఆ. వలను మెఱసి యన్యవాద కోలాహలం
 బనెడి సీసశతక మతిశయిల్ల, నే... ౬

టీ. కాటకోటయ్య అనుభక్తుఁడు కర్మమే దైవమనువాదమును చీకాకు పఱిచెను. దాసి దేవయ్య జైనమతస్థులవాదమును పిండిచేసెను. మార్కండేయ మహర్షి కాలమే దైవ మనువాదమును లేకుండఁజేసెను. హరగణశ్రేష్ఠులు ఇతరులవాదములయుద్ధతి నణఁగించిరి. ఇట్టి భక్తవరేణ్యులకరుణసంపాదించి యీశతకమును నేను రచింతును.

సీ. వేదాంతవేదసంవేదితార్థంబుల
నఖిలశాస్త్రేతిహాసార్థములును
సంచితోపపురాణసమ్యగర్థంబుల
నాదిపురాణ సారార్థములును
మోదితమూలాగమోదితార్థంబుల
నారుషపౌరుషేయార్థములును
భ్రాజితామేయ సంపాది తార్థంబుల
నంచితశివరహస్యార్థములును

ఆ. వరుసఁగూర్చి యన్య వాదకోలాహలం
బనెడు సీసశతక మతిశయిల్ల, నే... 2

టీ. వేదాంతవేదసంవేదితార్థంబులు = ఉపనిషత్తులందును వేదములందును తెలుపఁబడినవిషయములు, అఖిలశాస్త్రేతిహాసార్థములును = సమస్త శాస్త్రములలోను పూర్వగాథలలోను గలవిశేషములును, సంచితోపపురాణసమ్యగర్థంబులు = కూర్పఁబడిన ఉపపురాణములలోని మంచివిషయములును, ఆదిపురాణసారార్థములును, మొదటి అష్టాదశపురాణములలో సారమైన అంశములును, మోదితమూలాగమోదితార్థంబులు = అభివృద్ధినందిన ప్రధానాగమములలోని విషయములను, ఆరుషపౌరుషేయార్థములును = ఋషులు మహాపురుషులును దెలుపువిశేషములును, భ్రాజితామేయసంపాదితార్థంబులు = వికాసముతోఁగూడిన సాటిలేనియమూల్యవిషయములను, అంచితశివరహస్యార్థ

ములును = శివునిగూర్చిన విశేషరహస్యార్థములును క్రమముగ కూర్చి యీసీస
శతక మొప్పును.

సీ. వేదవాదులకును భేదవాదులకుదు
ర్మదబౌద్ధులకు గుండె బెదు రనంగ
నాత్మైక్యవాదమాయావాదులకును లో
కాయతులకుఁ గంటి కసు వనంగ
కాలవాదులకును గర్మవాదులకు సాం
ఖ్యులకు నుద్ధతిఁగట్టు గుది యనంగ
శాక్తేయవాద వైష్ణవవాదులకు నాంత
రాళికులకు నెత్తి గాల మనఁగ
ఆ. జైనవాదులకును సన్న్యాసులకు మహో
గ్రముగ ముక్కుమీఁదికత్తి యనఁగ
నీకృతి రచియింతు నే... ౧

టీ. వేదవాదులకు = మీమాంసకులకు, భేదవాదులకు = ద్వైతులకు, దుర్మతబౌద్ధులకు = దురభిమానముగల బౌద్ధమతస్థులకు, గుండెబెదురు = భయము గలిగించునది, ఆత్మైక్యవాదమాయావాదులకు = జీవాత్మపరమాత్మ లొక్కటియే, (మాయయే జగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు కారణమను అద్వైత మతస్థులకు), లోకాయతులకు=చార్వాకమతస్థులకు, కంటికసువు = కంటిలోని నలుసు (మిక్కిలి బాధనుకలిగించునది.) కాలవాదులకు=కాలమే పరమేశ్వరుఁడనువారికి, కర్మవాదులకు = కర్మమే దైవమనువారికి, సాంఖ్యులకు = ప్రకృతి పురుషవివేకమే మోక్షమనెడుసాంఖ్యమతస్థులకు, గుది=బందము త్రాడు, శాక్తేయవాదవైష్ణవవాదులకు = శక్తి నారాధించువారికి, విశిష్టాద్వైతమతస్థులకు ఆంతరాళికులకు = మాధ్వమతస్థులకు, నెత్తిగాలము = శిరస్సునందుఁ దగిలెడిగాలము, జైనవాదులకు = జినమహర్షియే దైవమనెడి జైనమతస్థులకు సన్న్యాసులకు = సన్న్యాసాశ్రమము తీసికొన్నవారలకు, ముక్కుమీఁదకత్తి.

### భస్మ మహిమ

సీ. శుంభద్గదాంభోధి కుంభజ సంరంభ
బంధుర ప్రతిభావిభాతి భూతి
దారిద్ర్యకుధ్ర విద్రావణ దారుణ
మాతతపురుహూత హేతిభూతి
నిర్బంధ బహుజన్మ నీరంధ్రమోహాంధ
కారార్క (దివ్య) విఖ్యాతిభూతి
కర్మవల్లీమూల నిర్మూలనోద్భాత
శాతకుద్దాలప్రభాతి భూతి
ఆ. యనుచుఁ జదివి చదివి యామ్నాయనుతభస్మ
విముఖవృత్తిఁ జెడిరి వెట్టి జన్మ
లెట్టిపాపమతులో యే

టీ. శుంభద్గదాంబోధి......విభాతి = అతిశయించురోగములను సముద్రమును కబళించుటలో అగస్త్యమహర్షికిఁగల సామర్థ్యమునుబోలిన సామర్థ్యముగలది. భూతి = భస్మము, దారిద్ర్య......పురుహూత హేతి = దారిద్ర్యమను పర్వతములను తరిమివేయుటలో వజ్రాయుధమైనది. నిర్బంధబహుజన్మ...అర్క విఖ్యాతి = తప్పనిదిగావచ్చు అనేకజన్మార్జితమైన గాఢమగు మోహాంధకారమునకు సూర్యప్రకాశమైనది. కర్మవల్లీ...కుద్దాలప్రభాతి = అనేక జన్మములనుండి పెరుగుచున్నకర్మ మనెడులతను కూఁకటివేరుతోఁ బెల్లగించుటకు గొద్దాలికమైనది, ఆమ్నాయ...భస్మవిముఖవృత్తిః = వేదములలో పొగడఁబడినభస్మను దాల్చుటకు విముఖమైనచిత్తవృత్తితో చెడిరి.

సీ. భసితంబు శంకరోల్లసితంబు భవభయ
గ్రసితంబు లోకప్రకాశితంబు

భసితంబు శ్రుత్యుపన్యసితంబు గంధప్ర
హాసితంబు మలిన సన్న్యాసితంబు
భసితంబు శివకళాభ్యసితంబు దుష్టవి
శసితంబు శిష్టానుశాసితంబు
భసితంబు భక్తిసంవసితంబు చంద్రికా
భసితంబు పరమప్రభాసితంబు

ఆ. యనుచుఁ జదివి చదివి యామ్నాయనుతభస్మ
విముఖవృత్తిఁ జెడిరి వెఱ్ఱిజన్ము
లెట్టిపాపమతులొ... ౧౦

టీ. భసితంబు = భస్మము, శంకరోల్లసితంబు = శంకరునిచేనలంకరించు కొనఁబడినది, భవభయకృశితంబు = సంసారభయమును లేకుండచేయునది, శ్రుత్యుపన్యసితంబు = వేదములలో ప్రసిద్ధమైనది, గంధప్రహసితంబు = మంచి పరిమళముతోఁగూడినది, మలినసన్న్యాసితంబు = మాలిన్యముపోఁగొట్టునది, శివ కళాభ్యసితంబు = ఈశ్వరాంశను కలుగఁజేయునది, దుష్ట విశసితంబు = దుష్టు లను హింసించునది, శిష్టానుశాసితంబు = శిష్టుచే స్వీకరింపఁబడినది, భక్తిసం వసితంబు = భక్తివాసన నిచ్చునది. చంద్రికాభసితంబు=వెన్నెలవలె తెల్లనైన నది, పరమప్రభాసితంబు = చాల ప్రకాశించునది.

సీ. భస్మంబు విమలసద్భక్తిక్రియా కల్ప
లతికాఫలార్థ మూలప్రదంబు
భస్మంబు శంకరార్పణయోగ్యభక్తి నై
వేద్యకుంభ పవిత్ర వేష్టనంబు
భస్మంబు సచ్ఛివ భక్తికేదార వ
స్సదోఘ పరిహృతోద్యర్థకంబు ?

భస్మం బలంకృత భక్తికన్యావశీ
కరణకల్పితతిలకప్రదంబు
ఆ. యనుచుఁ జదివి చదివి యామ్నాయనుతభస్మ
విముఖవృత్తిఁ జెడిరి వెట్టిజన్ము
లెట్టిపాపమతులో... ౧౧.

టీ. విమల...మూలప్రదంబు = స్వచ్ఛమైన భక్తియనెడు కల్పలతిక ఫలించుటకు మూలమైనది, శంకరార్పణ...వేష్టనంబు = శంకరునకు అర్పించుటకు తగిన నైవేద్యకలశమునకు పవిత్రమైన ఆవరణము, సచ్ఛివభక్తి...దృర్థకంబు = మంచి శివభక్తి యనెడుపొలము ఫలించుటకు మంచి నీరయినది. అలంకృతభక్తికన్యా...తిలకప్రదంబు = బాగుగ నలంకరించుకొనిన భక్తియను కన్యకను వశముచేసికొనుట కేర్పఱుపఁబడిన తిలకము యినది.

సీ. క్షారంబు భక్త్యలంకారంబు లోకాను
సారంబు విగత సంసార మనుచు
క్షారంబు పరమార్థసారంబు సద్గుణా
ధారంబు ప్రాభవోద్ధార మనుచు
క్షారంబు మోక్ష సంస్కారంబు భవబహి
ష్కారంబు వైదికాధార మనుచు
క్షారంబు వైరాగ్యసారంబు మోక్షాబ్ధి
తీరంబు నిరయనిస్సార మనుచు
నాదిఁ జదివి జదివి యామ్నాయనుతభస్మ
విముఖవృత్తిఁ జెడిరి వెట్టిజన్ము
లెట్టి పాపమతులొ యే... ౧౨

టీ. క్షారంబు = భస్మము, భక్త్యలంకారంబు = భక్తికి అలంకారమైనది, లోకానుసారంబు = లోకమును అనుసరించునది, విగతసంసారము =

సంసారమును దూరముచేయునది, పరమార్థసారంబు=పరమార్థమునకు సారమైనది, సద్గుణాధారంబు=సద్గుణములకు ఆధారమైనది, ప్రాభవోద్ధారము=గొప్పతనమును దెచ్చునది. మోక్షసంస్కారంబు = మోక్షమును కలిగించునది, భవబహిష్కారంబు = సంసారమును దూరముచేయునది, వైదికాధారము = వేదమార్గముననడుచుకొనువారి కాధారము, వైరాగ్యసాగరంబు = వైరాగ్యమును వృద్ధిచేయునది, మోక్షాభితీరంబు = మోక్షమునకు దరియైనది, నిరయనిస్సారము = నరకమును దాటించునది.

సీ. యక్షరక్షోరగా ధ్యక్షోపనాక్షేప
తిక్షీయమాన సంరక్షరక్ష
రూక్షేపణా బ్రహ్మారాక్షసవిక్షేప
ణక్షేపమానాభి రక్షరక్ష
యాక్షేపభూతాన లేక్ష కక్షపణుతా
దిక్షేపమాన సుర రక్షరక్ష
యక్షీయదాక్షిణ్య దక్షణేశ్వరభయ
ద్రక్షణ రక్షణ రక్షణ రక్షరక్ష
ఆ. యనుచుఁ జదివి చదివి యామ్నాయనుతభస్మ
విముఖవృత్తిఁ జెడిరి వెఱ్ఱిజన్మ
లెట్టి పాపమతులొ యే... ౧౩

టీ. యక్ష...సంరక్ష = యక్షులు రక్షస్సులు ఉరగులు మొదలగువారి బాధలచే పీడింపఁబడి కృశించువారికి రక్షకమైనది. రక్ష = విభూతి.

సీ. కరమర్థి నైశ్వర్యకారణోద్భూతినా
భూత్యైకహేతువై భూతి యయ్యె
తగభావనాద్భసితంబునా నిరవద్య
భావనోద్దామమై భసిత మయ్యె

నలినాపదాప్రక్షణాత్తారమనవిప
త్కరణ సంహారణమై తార మయ్యె
నలి నభి రక్షణా ద్రక్షేతి యనఁగ సు
ర్వాసు రక్షణీయమై రక్ష యయ్యె
ఆ. యనుచుఁ జదివి చదివి యామ్నాయనుతభస్మ
విముఖవృత్తిఁ జెడిరి వెఱ్ఱి జన్మ
లెట్టి పాపమతులో యే... ౧౪

టీ. కరము = మిక్కిలి, అర్థిన్ = పెంపుతో, ఐశ్వర్యకారాణోద్భూతినాన్ = ఐశ్వర్యమునకు కారణ మగునది యని, భూత్యైకహేతువై = సంపదకు ముఖ్యకారణమై, భావనాత్ భసితంబు=భావనచేయుటవలన భసితమని, నిరవద్యభావనోద్దామమై=సాటిలేనిభావనచే గొప్పదియై, ఆపదాప్రక్షణాత్తారమ్ = ఆపదనుండి రక్షించునదిగాన 'తారము' అని, విపత్కరసంహారణమై=ఆపత్తును గలిగించువానిని హరించునదియై, అభిరక్షణాద్రక్షేతి= అంతటను రక్షించునది గనుక 'రక్ష' యని, సుర్వాసురక్షణీయమై = దేవతల నుండి రాక్షసులనుండి రక్షించునదియై.

సీ. ధరఁ 'గృతం స్యాదకృతం 'తేస' యన భూతి
లే కెద్ది చేసిన లేదు ఫలము
ధరశ్రుతమప్యశ్రుతం భవే త్తన భూతి
లేకెద్ది విన్నను లేదు ఫలము
తగనధి తమనధి తం హైవ యనభూతి
లేకెద్ది నుడిపిన లేదు ఫలము
పారి నదీతూ న తపోమంత్ర మనభూతి
లేకెద్ది వొడఁగిన లేదు ఫలము

ఆ. యనుచుఁ జదివి చదివి యామ్నాయనుతభస్మ
విముఖవృత్తిఁ జెడిరి వెఱ్ఱిజన్ము
లెట్టి పాపమతులో యే... ౧౫

టీ. ధరన్ = భూమిపై, కృతంస్యాత్కృతం తేన = ఆతఁడు చేసినది చేయనట్లగును. శ్రుతమప్యశ్రుతంస్యాత్ = వినినను విననిదగును. అధీతమనధీతం = చదివినను చదవనిదగును. నతపోనదీక్షానమంత్రమన్ = తపస్సు, దీక్ష మంత్రము లేవు. భూతిఁదాల్పకున్న ఏదిచేసినను, ఏదివిన్నను, ఏది చదివినను ఫలింపవు.

సీ. సార్థంబుగా 'సర్వతీర్థేషు తత్పుణ్య'
మని చెప్పు మఱియు భీమాగమంబు
దృష్టంబుగా 'వైశ్వదేవే సురార్చనే'
యని చెప్పు మఱియు భీమాగమంబు
అనుషక్తి 'మృత్యుం జయతి మానవో' యంచు
నటుఁ జెప్పు మఱియు భీమాగమంబు
సత్యంబుగా 'దేవ సర్వమనుష్ఠితం'
బని చెప్పు మఱియు భీమాగమంబు

ఆ. ననుచుఁ జదివి చదివి యామ్నాయనుతభస్మ
విముఖవృత్తిఁ జెడిరి వెఱ్ఱి జన్ము
లెట్టి పాపమతులో... ౧౬

టీ. సార్థంబుగా = అర్థముతోఁ గూడునట్లుగా, సర్వతీర్థేషు = సమస్త తీర్థములందు, తత్పుణ్యం =ఆపుణ్యము, సమస్తతీర్థములందును స్నానముచేసిన ఫలము భస్మముధరించుటచేఁ గలుగును. దృష్టంబుగా = ప్రత్యక్షముగా, వైశ్వదేవే = వైశ్వదేవమనుహోమము చేయుటయందును, సురార్చనే =

దేవతార్చన చేయుటయందును కలుగుపుణ్యము గలుగుననుట, అనుష_క్తిన్ = మేనికిఁదగిలినంతమాత్రమున, మానవః = మనుష్యుఁడు, మృత్యుంజయతి = మృత్యువును జయించును, దేవ=ప్రభుదా! సర్వమ్=సమస్తమును, అనుష్ఠితమ్= చేయఁబడినది: భస్మమును దాల్చినవాఁడు సమస్తమును ఆచరించినవాఁడగును.

సీ. రమణమైఁ గూర్మపురాణంబు సర్వయ
జ్ఞేషుభాగిన యని నిశ్చయించు
క్రమ మొప్ప గరుడపురాణంబు తాభస్మ
నైవ ప్రకుర్వీత యని నుతించుఁ
బ్రతిన బ్రహ్మాండపురాణంబు తెల్పిన
భస్మనా విక్క_నిప్రస్తుతించుఁ
బ్రవిమలభంగి మానవపురాణము శివ
వాక్యం నసంశయో యని విధించు

ఆ. ననుచుఁ జదివి చదివి యామ్నాయనుతభస్మ
విముఖవృత్తిఁ జెడిరి వెఱ్ఱిజన్ము
లెట్టి పాపమతులొ... ౧౫

టీ. రమణమై = అందముగా, సర్వయజ్ఞేషు=సమస్తయజ్ఞములయందు, భాగినః=భాగముగలవారు, భస్మనైవ ప్రకుర్వీత=భస్మముతోఁగూడియే చేయవలెను. శివవాక్యం న సంశయః=శివుఁడు చెప్పినమాటగాన సంశయములేదు.

సీ. తగ మంత్రితంభస్మ ధారయే త్తనిమ్రోయు
నొగిని శ్వేతాశ్వతరోపనిషది
నెరయ జాబాలోపనిషది 'స ఏవభ
స్మ జ్యోతి'రని మ్రోయు మఱియు నట్ల
మహిమ 'భూత్యై న ప్రమదితవ్య'మని మ్రోయు
నాయజుర్వేదంబు నదియుఁగాక

మఱి 'యగ్నిరితిభస్మ' మన వాయురితి భస్మ
మన యథర్వణ శిరస్సునందు వ్రాయ
ఆ. ననుచుఁ జదివి చదివి యామ్నాయనుతభస్మ
విముఖవృత్తిఁ జెంది వెఱ్ఱిజన్ను
లెట్టి పాపమతులొ... ౧౮

టీక. మన్త్రితంభస్మధారయేత్ = మన్త్రింపఁబడిన భస్మమును ధరింపవలెను. స ఏవ భస్మజ్యోతిః=ఆభస్మమే తేజస్స్వరూపము, మహిమన్= సామర్థ్యముతో, భూత్యై న ప్రమదితవ్యం = భూతికొఱకు ప్రమాదమును పొందకూడదు. అగ్నిరితి భస్మ = అగ్ని యనునది భస్మము. వాయురితి భస్మ = వాయు వనునది భస్మము. అథర్వణశిరస్సునందు = అథర్వణశిఖ యను ఉపనిషత్తునందు (పైవిధము ఉపనిషత్తులందు విభూతిప్రాశస్త్యము చెప్పఁబడినది.)

సీ. విన నభూతో నభవిష్యతి యనుచు స్కాం
దాగస్త్య సంవాదమందు వ్రాయ
నిర్ణయంబుగ శివాగ్ని ర్భూతి రుత్తమం
బని క్రియాసారంబునందు వ్రాయ
మఱియుఁ జందన కుంకుమం బైవ యని దాని
యటమీఁద లైంగ్యంబునందు వ్రాయ
లలితం పురాణాని యఖిలాని చాయని
యఖిలపురాణంబులందు వ్రాయ
ఆ. ననుచుఁ జదివి చదివియామ్నాయనుతభస్మ
విముఖవృత్తిఁ జెడిరి వెఱ్ఱిజన్ను
లెట్టి పాపమతులొ యే... ౧౯

టీ. నభూతో నభవిష్యతి = ఇంతకుముందు లేదు, ఇఁకమీఁద ఉండదు, స్కాందాగస్త్యసంవాదమందు = స్కాందపురాణమునందున్న అగస్త్యమహర్షి సంవాదమునందు, శివాగ్నిర్భూతిరుత్తమం = విభూతి శివస్వరూపము, అగ్నిస్వరూపము, ఉత్తమమైనది, చందనకుంకుమంబైన = మంచి గంధము, కుంకుమమును, విభూతిమీఁదనే ధరింపవలయును, లైంగ్యంబునందు= లింగపురాణమునందు.

సీ. భీకరంబుగ సురాంపీత్వా యనుట సురా
పానాది దోషముల్ పాయుభూతి
గతి గురుదారాంశ్చ గత్వా యనుట గురు
తల్పగాద్యఘములు దలఁగు భూతి
కృతి బ్రహ్మహత్యాంచ కృత్వా యనుట బ్రహ్మ
హత్యాదిదురితంబు లడఁగు భూతి
ప్రతిముచ్యతే సర్వపాపేభ్య యనుట స
మస్తపాపంబులు మడియు భూతి
ఆ. యనుచుఁ జదివి చదివి యాఘ్నాయనుతభస్మ
విముఖవృత్తిఁ జెడిరి వెఱ్ఱిజను
లెట్టి పాపమతులో యే... ౨౦

టీ. సురాంపీత్వా=కల్లుత్రాగి, గతిన్=నడకలో, గురుదారాంశ్చగత్వా= గురువుభార్యతోఁ గ్రీడించి, గురుతల్పగాద్యఘములు = గురుపత్నీసంగమము మొదలగుపాపములు, పాయున్ = పోవును, కృతిన్ = చేఁతలో, బ్రహ్మహత్యాంచకృత్వా = బ్రాహ్మణుని చంపి, దురితంబులు = పాపములు, అడఁగు = నశించును, ప్రతిముచ్యతే సర్వపాపేభ్యః = సమస్తపాపముల నుండి విడువఁబడును, మడియున్ = నశించును. భూతి నిఖిలకల్మషక్షాలన సాధనమని భావము.

సీ. పద్మనాభాబ్జసంభవపాకశాసన
ముఖ్యులు భూతి త్రిపుండ్రధరులు
అర్కేందుపావక యమవరుణకుబేర
ముఖ్యులు భూతి త్రిపుండ్రధరులు
రామ మార్కండేయ రఘురామ బలరామ
ముఖ్యులు భూతి త్రిపుండ్రధరులు
ద్వైపాయనాగస్త్య వత్స కుత్స పులస్త్య
ముఖ్యులు భూతి త్రిపుండ్రధరులు
ఆ. అనుచుఁ జదివి చదివి యామ్నాయనుతభస్మ
విముఖవృత్తిఁ జెడిరి వెఱ్ఱిజన్ము
లెట్టిపాపమతులొ యే... ౨౧

టీ. పద్మనాభాబ్జసంభవ పాకశాసనముఖ్యులు = బ్రహ్మ విష్ణువు ఇంద్రుఁడు మొదలయినవారు, భూతిత్రిపుండ్రధరులు = విభూతియొక్క మూఁడురేఖలను ధరించినవారు. అర్కేందు పావక యమ వరుణ కుబేర ముఖ్యులు=సూర్యుఁడు చంద్రుఁడు అగ్ని యముఁడు వరుణుఁడు కుబేరుఁడు మొదలయినవారు, రామ మార్కండేయ రఘురామ బలరామముఖ్యులు=పరశురాముఁడు మార్కండేయుఁడు శ్రీరాముఁడు బలరాముఁడు మొదలయినవారు, ద్వైపాయనాగస్త్యవత్సకుత్సపులస్త్యముఖ్యులు = వ్యాసుఁడు అగస్త్యుఁడు వత్స కుత్స పులస్త్య మొదలయినవారును భూతిధారులే.

రుద్రాక్షమహిమ

సీ. యక్షరక్షోహి విద్యాధరకిన్నర
ముఖ్యులు భూతి త్రిపుండ్రధరులు
కపిల గౌతమ కణ్వ కౌశిక గార్గేయ
ముఖ్యులు భూతి త్రిపుండ్రధరులు

అరయ నేతాని రుద్రాక్షాణి యని యజు
ర్వేద సూక్తోక్తంబు విస్తరింప
నదియు వేదాధారయంతి వేదాధార
యంతి యంచు సద స్సందు మ్రోయ
యస్తాని ధారయే త్తనఁగ గచ్ఛంతి సం
సనగ తీర్వస్స్వప్న మనఁగ మఱియు
నది సున్మిషన్నిమిషన్నపి యనఁగ రు
ద్రాక్షాణి ధారణ మను సమస్త
ఆ. సంహితలఁ బురాణశాస్త్రేతిహాసముల్
నొప్పఁ జదివి చదివి చెప్పి విడిచి
రెట్టిపాపమతులో యే... ౨౨

టీ. యక్ష.........ముఖ్యులు = యక్షులు, రాక్షసులు, నాగులు విద్యాధరులు కిన్నరులు మొదలగువారు. అరయన్ = ఆలోచింపఁగా, ఏతానిరుద్రాక్షాణి = ఇవి రుద్రాక్షములు అని, యజుర్వేదోక్తసూక్తంబు = యజుర్వేదములోని మంత్రము, విస్తరింప = విస్తరించి చెప్పఁగా, వేదాధార యంతి = వేదములు ధరించుచున్నవి, సదస్సందు = యజ్ఞసభయందు, యస్తాని ధారయేత్ = ఎవఁడు వానిని ధరించునో, గచ్ఛంతి సంసనగతీర్వస్వప్నం = ఆతఁడు సంసారగతులను పొందఁడు. ఉన్మిషన్నిమిషన్నపి = నిద్రించినను మేలుకొనినను, రుద్రాక్షాణి ధారణమ్ = రుద్రాక్షలను ధరించుట, సమస్త సంహితల్ = సంహితలన్నింటిలో, పురాణశాస్త్రేతిహాసముల్ = పురాణములు శాస్త్రములు ఇతిహాసములు, ఒప్పన్ = తగునట్లుగా, చదివి చదివి చెప్పి విడిచిరి, ఎట్టిపాపాత్ములో.

సీ. శుభలీల సంధ్యాదిషుచ కర్మసూ యంచు
శైవపురాణ మాసక్తిఁ బలుక

సంచితంబుగ మృణ్మయం వాపి రుద్రాక్ష
మని మానవపురాణ మర్థిఁ బలుక
మహిమతో కింపున ర్మానుషాదయ యని
యమపురాణంబు నత్యర్థిఁ బలుక
నెఱయ రుద్రాక్షాణి యురసిస్థితే యని
యాలైంగ్యమునఁ బలుకట్లస్మృతులు
ఆ. సంహితలు పురాణశాస్త్రముల్ ఘటియింప
నట్టిదానిఁ బూన నక్కటకట
యేల విడిచి రిట్టులే... ౨3

టీ. శుభలీలన్ = శుభముగఁబగునట్లుగా, సంధ్యాధిషుచకర్మసు = సంధ్యావందనము మొదలయినకర్మలయందు రుద్రాక్షలు ధరింపవలయును, శైవపురాణము ఆసక్తిన్ = ప్రీతితో, అంచితంబుగ = బాగుగా, మృణ్మయంవాపిరుద్రాక్షం = మట్టితో తయారైన రుద్రాక్షమునైన ధరింపవలయును. మానవపురాణము, అర్థిన్ = ప్రీతితో, కింపునర్మానుషాదయః = మనుష్యులు మొదలయినవారు ధరింపవలయునని ఏమిచెప్పవలయును, రుద్రాక్షాణి యురసిస్థితే = రుద్రాక్షలు వక్షమున నుండఁగనే కర్మలు చేయవలయునని శ్రుతులు స్మృతులు పురాణములు శాస్త్రములు తెలుపఁగా అట్టిరుద్రాక్షలను ధరింపక ఏల విడిచియున్నారో ?

సీ. భంగిగా హరినీలలింగంబు నర్చించి
విష్ణుమున్ బడయఁడే విష్ణు పదము
శశికాంతలింగంబు సద్భక్తి నర్చించి
బ్రహ్మము న్బడయఁడే బ్రహ్మపదము
లీల నంబుజరాగలింగంబు నర్చించి
యింద్రుండు వడయఁడే యింద్ర పదము

కాంస్యసల్లింగంబు కరమర్థి నర్చించి
వసువులు వడయరే వసుపదంబు
ఆ. గాన హరుఁడె యాది కర్తయు నగుటకు
నచ్యుతాదు లీశు భృత్యు లగుట
కేల ప్రత్యయంబు లే... ౨౪

టీ. భంగిగా = బాగుగా, హరినీలలింగంబుఁ = ఇంద్రనీలమాణిక్యమయమైనలింగమును, విష్ణు = విష్ణువు - శశికాంతలింగంబు = చంద్రకాంతమాణిక్య పులింగమును, అంబుజరాగలింగంబు = పద్మరాగమాణిక్యలింగము, కాంస్యసల్లింగంబు=కంచుతో తయారైన మంచిలింగమును, కరము=మిక్కిలి, అర్థిఁ = ప్రీతితో, వసువులు = అష్టవసువులు, సురపదంబు = దేవస్థానము, వడయరే = పొందరా? కావునఁ = కావున, హరుఁడె = ఈశ్వరుఁడే, ఆది కర్త = మొదటికర్త, అచ్యుతాదులు = విష్ణువు మొదలగువారు, ఈశుభృత్యులగుటకు = ఈశ్వరుని భృత్యులగుటకు, ప్రత్యయంబులు = విశ్వాసములు.

సీ. సూర్యత్వ మర్థించి సూర్యుండు పూజించె
తామ్రలింగంబు నుద్దామభక్తి
సోమత్వ మర్థించి సోముండు పూజించె
మౌక్తికలింగంబు మహితభక్తి
వరుణత్వ మర్థించి వరుణుండు పూజించె
రత్నలింగము నభిరమ్యభక్తి
ధనదత్వ మర్థించి ధనదుండు పూజించె
హేమలింగంబున హీనభక్తి
ఆ. ననుచుఁ జదివి చదివి యట్లొ కోయిలలింగ
బాహ్యులై మహోగ్రపాతకముల
నేల విడిచి రిట్టు లే...... ౨౫

టీ. సూర్యత్వము = సూర్యుఁడగుటను, అర్థించి = కోరి, తామ్ర లింగంబును = రాగితో తయారుచేసిన లింగమును, ఉద్దామభక్తిన్ = గొప్ప భక్తితో, సోమత్వము = చంద్రుఁడగుటను, సోముండు = చంద్రుఁడు, మౌక్తికలింగంబు = ముత్యములతోఁ దయారుచేసిన లింగమును, మహిత భక్తిన్ = గౌరవింపఁదగినభక్తితో, వరుణత్వము = వరుణపదవిని, రత్న లింగము = రత్నమయమైనలింగము, అభిరమ్యభక్తిన్ = అందమైనభక్తితో, ధనదత్వము = కుబేరపదవిని, ధనదుండు = కుబేరుఁడు, హేమలింగంబును= బంగారులింగమును, అహీనభక్తిన్ = గొప్పభక్తితో, లింగబాహ్యులై = లింగమునకు దూరమైనవారై.

సీ. అజహరీంద్రాదులు హరుశిరంబున దాల్తు
రటు శిరోభి ర్ధారయంతి యనఁగ
యలికాగ్రమున నలికాగ్రేక్షునిం దాల్తు
రటు రాక్షసులును ద్రియక్షహరుని
కంఠేషు నాహర కంఠాదిబుషులు శ్రీ
కంఠుఁ దాల్తురు భక్తిఁగంధరముల
మనస స్తథాయన మనువులు తత్ప్రదే
శమునను దాల్తు రీశాను ననుచుఁ
ఆ. జదివి చదివి తారు నది యెట్లొకో లింగ
బాహ్యులై మహోగ్ర పాతకముల
హేతువులైరి వెఱ్ఱు లేకామ్రగురుచిత్త... ౨౬

టీ. అజహరీంద్రాదులు = బ్రహ్మావిష్ణువు ఇంద్రుఁడు మొదలగువారు, శిరోభిర్ధారయంతియనఁగ = శిరస్సులచే ధరించుచున్నారు అని యనుటవలన వైష్ణవారు శిరస్సులమీఁదలింగమును ధరింతురు అలికాగ్రమున = భ్రూమధ్యము చివరను. అలికాగ్రేక్షుని = భ్రూమధ్యముకొనను కన్నుగల ఈశ్వరుని,

త్రియక్షహరుని=మూఁడుకన్నులు గలశివుని. కంఠేషునాన్=కంఠేషు అనఁగా హరకంఠాదిఋషులు = హరకంఠుఁడు మొదలగుఋషులు, శ్రీకంఠున్=గరళకంఠుఁడగుఈశ్వరుని, కంధరములన్ = కంఠములయందు, మనస్తథాయనన్=ఆరీతిగనే మనస్సునకు అనఁగా మనువులు, తత్ప్రదేశమునను = మనస్సునందును. ఈశానున్ = ఈశ్వరుని, దాల్తురు = ధరింతురు.

సీ. పాణిని భవదీయ భజనముచేసి వ్యా
కరణసూత్రములకుఁ గర్త యయ్యె
మీ ప్రసాదంబున మీమాంసశాస్త్రసం
గతికి జైమిని సూత్రకర్త యయ్యె
న్యాయశాస్త్రమునకు నక్షపాదుండు మీ
కరుణ పెంపున సూత్రకర్త యయ్యె
శివ మిమ్ముఁ గొలిచి వైశేషికశాస్త్రలే
ఖకకణాదుఁడు సూత్రకర్త యయ్యె
ఆ. నాద్యు లిట్లు గొల్చి వేద్యులై నెగడుట
నెఱిఁగి యెఱిఁగి భక్తిహీను లగుట
నేమి మూర్ఖజన్ము లేకాప్ర... ౨౭

టీ. పాణిని = వ్యాకరణసూత్రకర్త యైనమహర్షి, భవదీయభజనము చేసి=మీసేవచేసి, మీమాంసశాస్త్రసంగతికి=మీమాంసశాస్త్రమును రచించుటకు, న్యాయశాస్త్రమునకు = తర్కశాస్త్రమునకు, అక్షపాదుండు = గౌతముఁడు, మీకరుణపెంపునన్=మీకరుణావిశేషముచే, వైశేషికశాస్త్రలేఖకకణాదుఁడు = వైశేషికతర్కము రచించిన కణాదమహర్షి, ఆర్యులు=పూజ్యులైన మహర్షులు, వేద్యులై = వేత్తలై, సమస్తము తెలిసినవారై, నెగడుట=మించుట.

సీ. వేదాంతశాస్త్రసంవిత్సూత్రకర్తయై
మెఱసిన వ్యాసుండు మిమ్ముఁ గొ

నరయ మీామాంస భాష్యముఁ జేసి మొదటి భ
ట్టాచార్యు లకట మి మ్మర్థిఁ గొలిచె
ధర్మార్థవిద్యాష్టదశశాస్త్రపరులైరి
నెమ్మి మన్వాదులు మిమ్ముఁ గొల్చి
వరసూత్రభాష్యప్రకరణాదిమేటి ని
ర్మితులైరి తగబుధుల్ మిమ్ముఁ గొల్చి
ఆ. యాద్యు లిట్లు గొల్చి వేద్యులై నెగడుట
యెఱిఁగి యెఱిఁగి భక్తిహీను లగుట
కేమిచెప్పవచ్చు నే కామ్ర... ౨౫

టీ. వేదాంతశాస్త్రసువిత్సూత్రకర్తయై = వేదాంతశాస్త్రజ్ఞానమును కలిగించు బ్రహ్మసూత్రములను రచించినవాఁడై, మీామాంసభాష్యము = మీామాంసాశాస్త్రమునకు వ్యాఖ్యానమును, భట్టాచార్యులు = కుమారిలభట్టాచార్యులు, ధర్మార్థవిద్యాష్టదశశాస్త్రపతులు = ధర్మము అర్థము మొదలగు పదునెనిమిదిశాస్త్రములకు అధిపతులు, వరసూత్రభాష్యప్రకరణాదిమేటి = మంచి మంచిసూత్రములు భాష్యములు ప్రకరణములు మున్నగువిశేషములను, నిర్మితులైరి = రచించినవారైరి.

సీ. శాస్త్రముల్ చదివినఁ జదువుఁ గాకేమియు
శాస్త్రముల్ చిలుకలు చదువ వెట్లు
ధరయెల్లఁ దిరిగినఁ దిరుగుఁగాకేమియు
భ్రమ్మట మృగములు దిరుగ వెట్లు
కుడుపుదా నుడిగిన నుడుగుఁ గాకేమియా
కుడుపు పరాకేయు లుడుగ వెట్లు
ఆకాశచరుఁడైన నగుఁగాక నేమి యా
యాకాశమునఁ బక్షు లెగుర వెట్లు

ఆ. గాన భ క్తిహీనుఁ డైనవాఁ డెంతవాఁ
డైన వాని విద్యమానుషంబు
లెల్లమిథ్య గాదె యే... ౨౯

టీ. శాస్త్రములు చదివినను చిలుకపలుకవలెనుండినకొఱగాదు. భూమి యంతయు తిరిగి తీర్థాటనముచేసినమాత్రాన ప్రయోజనములేదు. మృగములు చాలదూరము తిరుగుటలేదా? హృదయమునందు భక్తిభావము కలుగవలయు ననుట.చిత్తము పరమేశ్వరాయత్తముగాక భోజనముమానినను నప్రయోజనమే. యోగాభ్యాసముచేసి విహంగయానము నలవఱచుకొనినంతమాత్రాన సిద్ధించున దేమియులేదు. పక్షు లాకసమున సంచరింపవా? వానికి మోక్షము సిద్ధించె నందుమా! భక్తిలేనివాఁ డెంతటివాఁడైనను లాభములేదు. వాని కెన్ని విద్యలువచ్చినను అవియన్నియు మానుషము లగుటచే మిథ్యయే.

సీ. ఖద్యోతతతు లంధకారంబు గుదియింపఁ
జాలునా? సూర్యుండు చాలుఁగాక
సరిచుక్క లెన్నైన జగములు వెలిగింపఁ
జాలునా? చంద్రుండు చాలుఁగాక
శ్వానసమూహముల్ సామజంబును జంపఁ
జాలునా? సింహంబు చాలుఁగాక
గండూషజలములు కార్చిచ్చు గుదియింపఁ
జాలునా! ఘనవృష్టి చాలుఁగాక
ఆ. నట్టు లన్యదేవతార్చనల్ భవముల
దీర్పఁజాలునే త్వదీయభక్తి
యొందుఁజాలుఁగాక యే... ౩౦

టీ. ఖద్యోతతతులు = మిణుగురుపురుగులగుంపులు, అంధకారంబున్ = చీకటిని, కుదియింపఁ జాలునా = పోఁగొట్టఁ జాలునా? చాలుఁగాక = సరిపడునుగాక, సరిచుక్కలు = సమానమైన నక్షత్రములు, జగములు = లోకములు, శ్వానసమూహముల్ = కుక్కలగుంపులు, సామజంబును = ఏనుఁగును, గండూషజలములు = పుక్కిటఁబట్టిననీళ్లు, కార్చిచ్చున్ = దావాగ్నిని, నరియింపఁజాలునా = ఆర్పఁజాలునా ? ఘనవృష్టి = మేఘునివర్షము, అన్యదేవతార్చనల్ = ఇతరదేవతలపూజలు, భవములన్=సంసారములను,(జన్మకర్మప్రవాహములను) తీర్పఁజాలునే = నశింపఁ జేయఁ జాలునా ?

సీ. ఎల్లదేశంబుల నేలెడిరాజున
కొకయూరు ఫలియింప కున్న నేమి ?
సకలనదీ నదాశ్రయమైన వార్ధికి
నొక వెడవంత రాకున్న నేమి ?
పదికోట్ల యావులఁ బితికెడువానికి
నొకయావు పితుకక యున్న నేమి?
కల్పవృక్షాటవి గలుగుపుణ్యాత్మున
కొకమ్రాను ఫలియింప కున్న నేమి ?
ఆ. యట్లు కేశవాదు లర్చించుచున్న నీ
కొకఁడు భక్తిసేయకున్న నేమి ?
యాహితానుషంగ యే... ౩౧

టీ. సకలనదీనదాశ్రయమైన = సమస్తమైననదులకు నదములకు ఆశ్రయమయిన, వార్ధికి = సముద్రమునకు, వెడవంత=చిన్నయేఱు, పితికెడు వానికి = పాలిచ్చెడువానికి, పితుకకయున్నన్ = పాలీయకున్న, మ్రాను = చెట్టు, (విష్ణువు మొదలయిన యవతారపురుషులు సేవించు నిన్ను ఎవ్వరైన నొక్కరు సేవింపకున్న కొఱంత యేమి కల్గును.)

సీ. వార్ధకమైన బ్రోవనిపట్టి తండ్రికిఁ
గ్గ్లైనేమి తలంప నీల్గె నేమి ?
ప్రజలకు ననుభవింపఁగరాని ముషిణి దా
పండె నేమి తలంప నెండె నేమి ?
సకలంబు కిడరాని సంపద పొంపిరి
పోయెనేని తలంపఁబోయె నేని?
పతి కనుకూలమై పరగనిసతి యేపు
మీఱె నేమి తలంపఁ బాఱె నేమి?
ఆ. యిట్లు నీదుభక్తి యలరని కష్టుండు
పుట్టెనేమి వాఁడు గిట్టె నేమి?
యాహితానుషంగ యే... 3౨

టీ. వార్ధకమైనఁ = ముసలితనమువచ్చినప్పుడు, బ్రోవనిపట్టి = రక్షింపనిపుత్రుఁడు, ఈల్గెనేమి = చచ్చిపోయిననేమి? ముషిణి = ముషిణిచెట్టు, సకలంబు కిడరానిసంపద = ఆదరువు ఇచ్చుటకు వీలుకానిసంపత్తు, పొంపిరిపోయెనేమి = హెచ్చుగా పెరిగిననేమి ! పోయెనేమి = నశించిపోయిన నేమి ? సతి = ఇల్లాలు, ఏపుమీఱెనేమి = ఆదరముగా నుండిననేమి? పాఱెనేమి = లేచిపోయిననేమి? అలరనికష్టుండు = మించనినీచుఁడు.

సీ. మ్రానుచుట్టుదిరుగ మంచిదని నుతింప
గానుగ యెద్దేమి గనియె తిరిగి
స్నానము శుచిచేయు నేని యేశుచి యయ్యె
నిత్యంబు గున్నంగినీళ్లఁ గ్రుంకి
తలబోడిదైనను దత్త్వజ్ఞఁ డేనియుఁ
దలబోడి పడుచు తత్త్వజ్ఞురాలె

సతిఁగూడమియ బ్రహ్మచర్యమేని శిఖండి
సతిఁగూడ డది బ్రహ్మచారి యౌనే
ఆ. యేమిచెప్ప భక్తిహీనవ్రతంబులు
బుగ్గిలోన నెయ్యిపోసినట్లు
యెన్న నేల యింక నే... 33

టీ. చెట్టుచుట్టును దిరిగిన మంచిదని నుతించినచో గానుగయెద్దు ప్రానిచుట్టును దిరిగి యేమి గడించినది? స్నానముచేయుచుండిన పరిశుద్ధికలిగెడిచో గున్నంగి యనునీటిపక్షి ఎప్పుడు నీళ్లలో మునుఁగుచు ఎంత శుచియైనది? తలగొరిగించుకొని నంతనే ఆత్మతత్త్వము తెలిసినవాఁడైనచో తలబోడిచేసికొన్న పడుచుకాంత ఎంతటితత్త్వజ్ఞురాలు? భార్యతోఁ గలియక యుండుటయే బ్రహ్మచర్యవ్రతమైనచో నపుంసకుఁడు భార్యతో కూడనే కూడఁడు. అంతమాత్రాన ఆతఁడు బ్రహ్మచారి యగునా? భక్తిలేని వారివ్రతములు నియమము బూదిలోపోసిన నేయినంటిది. కావున వ్రతములకు నియమములకు భక్తియే ప్రధానము.

సీ. శివపురాణాదులు చెవిఁబెట్టనొల్లరు
గోత్రపథాదులు కోరి విందు
ప్రమథగణాడంబరము విన నొల్లరు
వేఁబిణామహావథల్ ప్రేమ వింద్రు
ఘనగురుబోధ లాకర్ణింప నొల్లరు
గురుపథాకథనంబుఁ గోరి వింద్రు
హరభక్త మాహాత్మ్య మాలింప నొల్లరు
యుగ్రజాతులపథ లర్థి వింద్రు
ఆ. పిసమతులు దుర్వివేకాభిరతులుక
ల్మషయుతులును కష్టమానచరితు
లెట్టిపాపమతులో యే... 34

టీ. శివపురాణాదులు = శివపురాణము మొదలగునవి, గోత్రవధాదులు = వంశముల నాశనములు మొదలగునవి, ప్రమథగణాడంబరము = ప్రమథగణములయొక్క వీరగాథలు, పితామహవధల్ = బ్రహ్మదేవునివధలు మొదలగువానిని, అగ్రజాతులవధలు=బ్రాహ్మణక్షత్రియవైశ్యజాతులహత్యలు, విరసమతులు = వికటమైన బుద్ధిగలవారు, దుర్వివేకాభిరతులు = చెడతీయు వివేకము నార్జించువారు.

సీ. శాలిహోత్రంబర్థి చదువంగ నగుగాక
హయరత్నములనెక్కి యాడఁదగునె
గజలక్షణంబులు ఘటియింప నగుఁగాక
కినిసి యేనుఁగుల రక్షింప నగునె
భరతశాస్త్రంబులు పఠియింప నగుఁగాక
ననుభవుల్ గొనియాడ నాడఁదగునె
వీరరసస్ఫూర్తి విరచింప నగుఁగాక
నని మొనలావుసేయంగ నగునె
ఆ. యెల్లశ్రుతులు చదువ నగుఁగాక తత్సార
మైన నీదుమహిమ నవనిజనులు
ఎఱుఁగఁజాల రెట్టి లేకాన్ర... 32

టీ. శాలిహోత్రంబు = అశ్వశాస్త్రము, హయరత్నములక్ =జాతి గుఱ్ఱములను, ఘటియింపనగుఁగాక = తెలిసికొన వీలగునుగాని, కినిసి=కోపించి, భరతశాస్త్రంబులు = అభినయశాస్త్రములు, అనుభవుల్ = అభినయనమునందు అనుభవముగలవారు, వీరరసస్ఫూర్తిక్ =వీరరసము ఒలుకునట్లు, రచియింపనగుఁగాక = కవిత్వము చెప్పవచ్చునుగాని, అనిమొనన్ = యుద్ధముఖమున, లావు సేయంగనగునె = పరాక్రమము చూపింపవీలగునా!

శివశ్రేష్ఠత్వము (శివుఁడు గొప్పవాఁడగుట)

సీ. శ్రుతి "సర్వమన్య త్పరిత్యాజ్య" యని యథ
ర్వణవేదసూక్తి భావ్యముగ మ్రోయ
శ్రుతి "శివా దన్య త్పరిత్యజే" త్తని జ్ఞాన
యోగఖండము కరమొప్ప మ్రోయ
నట్ల "సర్వం సర్వమన్యత్పరిత్యజే"
త్తని మానవపురాణ మర్థి మ్రోయ
నలరేగ "సర్వమన్య త్పరిత్యాజ్య" యని
పారాశరపురాణ ఫణితి మ్రోయ
ఆ. నన్యదైవభజన మటుగాన నిబ్భంగి
విడిచి శంభుఁ గొల్వ వేదమతము
ఈహితానుషంగ యే... 3౽

టీ. శ్రుతి=వేదము, సర్వమన్యత్పరిత్యాజ్యయని = ఇతరమైనదానినంతను వదలి, శివాదన్యత్పరిత్యజేత్, శివునికంటె ఇతరమైనదానిని వదలివేయవలెను, సర్వంసర్వమన్యత్పరిత్యజేత్ =ఇతరమైనదాని నంతకంటను వదలివేయవలెను, ఈరీతిని శ్రుతులు పురాణములు ఇతరము సమస్తము విడిచి శివుని సేవింపవలయునని తెలుపుచున్నవిగాన ఇతరదేవతలను విడిచి యీశ్వరుని సేవించుటయే వేదమతము.

సీ. నిశ్చయంబుగఁ "బూజనీయం శివాశ్రయం"
బనుట భక్తుఁడు సూవె యగ్రగణ్యుఁ
డౌగి "శివపాత్ర ముత్తమం" బనుట త
థ్యంబు భక్తుఁడు సూవె యగ్రగణ్యుఁ

డప్రస్తమతి "నతిపాత్రం మహేశ్వరో"
యనుట భక్తుఁడు సూవె యగ్రగణ్యుఁ
"డత్యుత్తమః శివపదాభ్యర్చకో" యనుచును
ననుట సూవె భక్తుఁ డగ్రగణ్యుఁ
ఆ. డనుచు నాగమేతిహాస పురాణశా
స్త్రాది మహిత సూక్తులందుఁ దెల్పు
టెట్లు మీకుఁ జెప్పనే... 32

టీ. శివాశ్రయమ్ = శివుని ఆశ్రయించినది, పూజనీయమ్=పూజింపఁదగినది, అగ్రగణ్యుఁడు=ఉత్తముఁడు, శివవత్ =శివునివలె. ఉత్తమంపాత్రమ్= ఉత్తమపాత్రమైనవాఁడు, అప్రస్తమతిన్ = వీడనిబుద్ధితో, మహేశ్వరః= ఈశ్వరుఁడు, అతిపాత్రం = పాత్రలన్నిటికంటె అతిశయించినపాత్రము, శివపదాభ్యర్చకః = శివుని పాదములను పూజచేయువాఁడు, అత్యుత్తమః = మిక్కిలి ఉత్తముఁడు, ఆగమేతి...సూక్తులందు=శైవాగమములందు భారతాదిఇతిహాసములందును, (పురాణము శాస్త్రములు మొదలగు సమస్తపూజ్య ప్రమాణవాక్యములందు)

## భక్తచర్య

సీ. శివుఁడె దైవం బని శిఖఁ బచ్చడంబున
బంధించె 'శ్రీపతి పండితయ్య'
హరుఁడె దైవం బని హాలాహలము మ్రింగి
ప్రతిచూపె 'బండారు బసవవిభుఁడు'
భవుఁడె దైవం బని ఫణిరాజు నొడిసి యు
ద్ధతిఁబట్టె 'దేవరదాసమయ్య'
మృడుఁడె దైవం బని కృష్ణాదిదివిజుల
దండించె 'శంకరదాసమయ్య'

ఆ. గాన భక్తు లగ్రగణ్యు లౌటకుఁ, గాల
హరుఁడె యాదికర్త యగుటకొండు
లేల ప్రత్యయంబు లే... 3౮

టీ. శిఖిన్ = అగ్నిని, పచ్ఛదంబున = బట్టలో, బంధించెర్ = కట్టెను, హాలాహలము = విషమును, ప్రతిచూపె = మాఱుచూపించెను, ఫణిరాజున్ = పెద్దత్రాచును, ఒడిసి = ఒడిసిపట్టుకొని, కృష్ణాదిదివిజులన్ = కృష్ణుఁడు మొదలగుబ్రాహ్మణులను (భక్తులు ఈశ్వరునియందు మిక్కిలి నమ్మకముగలవారగుచు సామాన్యజనులు చేయలేనిపనులుచేసి చూపించిరి. కావున భక్తులు) అగ్రగణ్యులౌటకు = ఉత్తములగుటకు, కాలహరుఁడె = ఈశ్వరుఁడే, ఆదికర్తయగుటకు = మొట్టమొదటికర్త యగుటకు, ఒండులు = ఇతరమైన, ప్రత్యయంబులు = నిదర్శనములు, ఏల = ఎందులకు.

సీ. కడఁగి మూకాంగనఁ గవితఁ జెప్పింపఁడే
యల 'దిరువాలూరు నాయనారు'
వెలికిఁ దోఁడినపాండువీపు గూ నుడుపఁడే
నలువొప్ప 'సంబంధినాయనారు'
మట్టి గాల్పించి యమ్మహిమ నెల్ల రెఱుంగఁ
బడయఁడే 'కోపూరి బ్రహ్మవిభుఁడు'
కలుసందిభట్ల నంకపఙాంబు మేపఁడే
'బాపూరి బ్రహ్మయ్య' భక్తవరుఁడు

ఆ. గాన భక్తు లగ్రగణ్యు లౌటకుఁ గాల
హరుఁడె యాదికర్త యౌట కొండు
లేలప్రత్యయంబు లే... 3౯

టీ. మూకాంగనన్ = మూగయాడుదానిని, వెలికిదోఁడిన = బయటకు వచ్చిన, వీపుగూను = వీపువంకర, ఉడుపఁడే = పోఁగొట్టఁడా ?

సీ. ఏరాజసూయంబు లెనవచ్చు ననవచ్చు
నయ్య 'యేణాధినాథయ్య' కృతికి
నే నరమేధంబు లెనవచ్చు ననవచ్చు
నయ్య 'శిరియాలు' మహాత్త్వమునకు
నే ఘోటకమఖంబు లెనవచ్చు ననవచ్చు
నయ్య 'బండార్బసవయ్య' క్రియకు
నేపౌండరీకంబు లెనవచ్చు ననవచ్చు
న 'య్యిరుపత్తుమహాత్త్వమునకు'
ఆ. నేమిచెప్పభక్తి కెనగానిమఖములు
కారణంబు లెన్నిగాకయుండు
నెక్కుడయ్య భక్తి యే... ౪౦

టీ. ఏరాజసూయంబులు = ఏరాజసూయయాగములు, ఎనవచ్చునే = సరిపడును, కృతికి = పనికి, నరమేధంబులు = మనుజుని బలిగా ఇచ్చి చేయు యజ్ఞములు, మహాత్త్వమునకు = గొప్పతనమునకు, ఘోటకమఖంబు = అశ్వమేధయాగము, పౌండరీకంబులు = పౌండరీక మనుయాగములు, భక్తికి ఎనగాని = సాటివిగాని, కారణంబులు ఎన్నిగాకయుండు = పుణ్యమున కారణములు ఏవికాకయుండును, భక్తియే యెక్కుడు = అధికమయినది.

సీ. క్రతుకర్మఫలము దక్షప్రజాపతితలఁ
దఱిగించి మేషంబు తలకుఁ దెచ్చె
నధ్వరారంభఫలావాప్తి సగరులఁ
బటుముని కోపాగ్నిపాలుపఱచె
యజ్ఞఫలము నహుషావనీవల్లభు
భువి పెద్ద చెఱుపాపపుర్వుఁ జేసె

సవనకృత్యంబులు సంధిల్ల ధర్మజు
బంధుక్షయంబు నాపదల ముంచె
ఆ. వేదఫలము సామవేదుల నలయించె
నట్లు భక్తి తక్కువైన మఖము
లెచటి కెక్కువౌను నే... ౪౧

టీ. క్రతుకర్మఫలము = యజ్ఞముచేసినందులకు ఫలము, దక్షప్రజాపతి తలన్ = దక్షప్రజాపతియొక్కతలను, తఱిగించి = నఱికించి, మేషంబు తలకు = గొఱ్ఱెతలదాల్చుటకు, తెచ్చెన్ = తీసికొనివచ్చెను. అధ్వరారంభఫలావాప్తి = యజ్ఞము ప్రారంభించినందులకుఁ గలిగినఫలము, సగరులన్=సగరుని అఱువదివేలమంది కొడుకులను, మునికోపాగ్నిపాలుపఱచె=కపిలమహర్షియొక్క కోపమనెడు అగ్నికి వశముచేసెను. సవనకృత్యంబులు = రాజసూయయజ్ఞమునందలి క్రీగూఁకలాపములు, సంధిల్లన్ = జరుగఁగా, ధర్మజున్= ధర్మరాజును, బంధక్షయంబును = బంధువులు నశించుటయు, ఆపదలన్ = ఆపత్తులలో, ముంచెన్ = మునుగఁజేసెను. నహుషావనీవల్లభున్ = నహుషమహారాజును, భువిన్ = భూమిలో, పెద్దచెడుపాపపుర్వున్ = పెద్దదయిన చెడ్డపాముగా చేసెను. వేదఫలము = వేదము చదివినందులకు ఫలము, సామవేదులన్=సామవేదము పఠియించినవారిని, అలయించెన్ = శ్రమపెట్టెను. మఖములు=యజ్ఞములు భక్తి తక్కువయినయెడల ఎచ్చటను ఎక్కువ యైదును.

సీ. భవ్యుండు 'కలకేతబ్రహ్మయ్య' యవలీల,
బదడు చేపట్టినఁ బసిఁడి గాదె?
'మోళిగ మారయ్య' ముట్టిన మాత్రాన
కట్టెలు మేల్మిబంగారు గావె?
'కన్నడ బ్రహ్మయ్య' కరమర్థిఁ ద్రవ్విన
కన్నపుమను కనకంబు గాదె?

'శంకరదాసయ్య' సమదృష్టిఁ జరణవి
శ్రమతల మర్థిఁ గాంచసము గాదె?

ఆ. గాన భక్తి కలిమి కలిమిగా కిట వేఱె
కలిమి యేమికలిమి? కలిమి భక్త
లెందు సరకుగొంద్రె యే... ౪౨

టీ. భవ్యుండు = పూజ్యుండు, పసడు = బూడిద, పసిఁడి = బంగారము, కట్టెలు = కట్టెలు, కస్నపుమను=కన్నములోనిమన్ను, సమదృష్టిన్ = సరియైనచూపుతో, చరణవిశ్రమపలము = పాదముంచినచోటు, భక్తికలిమి = భక్తిసంపద, కలిమిగాక = సంపదగాక, వేఱెకలిమి = ఇంకరమైనభాగ్యము, ఏమికలిమి = ఏమిభాగ్యము, భక్తులు, ఎందును, కలిమిన్=డబ్బును, సరకుగొంద్రె=లెక్క చేయుదురా?

సీ. పరికింపఁగానల 'సిరియాలు' భక్తి భా
పంబున నక్క లశ్వంబు లయ్యె
'నేణాధినాథుని' యాడితభక్తి ను
ద్ధతి హేతి పువ్వులదండ యయ్యె
'మునిడి చౌడయ'భక్తి మోహంబుసునింది
పంటలు తా తియ్యపండులయ్యె
'నమినంది' భక్తి విన్నసువున నిర్మలో
దకము నిత్యము దీపతైలమయ్యె,

ఆ. గాన భక్తి కలిమి కలిమిగా కిటవేఱె
కలిమి యేమికలిమి? కలిమి భక్త
లెందు సరకుగొంద్రె యే... ౪౩

టీ. సిరియాలుండు తనభక్తివిశేషముచే నక్కలను గుఱ్ఱములనుగాఁ జేసెను.

వీణాధినాథునకు నుతికెక్కినభక్తిచే కత్తి పూలదండయై మెడలో పడెను. ముసిడి చౌడయ్య భక్తిచే ముసిడిపండ్లను తియ్యనిపండ్లనుగాఁ జేసెను. నమి నంది యను నాతఁడు తనభక్త్యతిశయముచే నీటినే నూనెగాఁజేసి నిత్యదీపములను వెలిఁగించెను. ఇట్టీశ్వరభక్తులభాగ్య మెట్టిభాగ్యమని చెప్పవచ్చును? వారు సామాన్యమైన సంపదకై ప్రాకులాడరు.

సీ. 'బసవయ్య' కోపాగ్ని భస్మమై పోవదే
పాపిబిజ్జలనరపాలుకలిమి
'యెడపదరేచు' శాపాగ్నిచేఁ గాలదే
జగతిని నాఁటిరాజన్యుకలిమి
'యారాధ్యదేవు'శాపాగ్ని నిస్తుషముగా
దే వెలనాఁటిచోడేంద్రుకలిమి
'ధవళేశునామయ్య' దారుణశాపాగ్ని
నెఱియదే యుదయావనీశుకలిమి
ఆ. గాన భక్తి కలిమి కలిమిగా కిట వేఱె
కలిమి యేమి కలిమి కలిమి భక్త
లెందు సరకుగొంద్రె యే... ౪౪

టీ. బసవయ్య శాపముచే బిజ్జల భూపాలుని సంపద భస్మమైపోయెను. ఆరాధ్యదేవుని శాపముచే వెలనాటిచోళుని సంపద బూడిద యయ్యెను. ధవళేశునామయ్య దారుణశాపము నీయగా ఉదయావనీశునిసంపద నశించెను. గాన భక్తికలిమియే కలిమి.

సీ. ధూపావసరమున ధూపఘంటయుఁ దాను
హరుపురంబున 'కోహిళయ్య' యరిగె
శివుఁడు పుత్తెంచిన సితవారణము నెక్కి
యభవుని గూడ'నం బన్న' యరిగె

ధర 'శంకరయ్య' శంకరలోకమున కేఁగ
ప్రమథు లుప్పొంగఁ దాళములతోడ
గుడియుఁ గోటయుఁ దాను గొనిపోయె వెండికొం
డకు మహాత్ముఁడు 'దీపదకలియారు'

ఆ. యనుట కెల్ల మొన్న మనమార కల్లయ్య
శంభుఁ జేరఁ జనఁడె సాక్షి వేతె
యేల ప్రత్యయంబు లే... ౨౫

టీ. ధూపావసరమున = ధూపము నిచ్చుసమయమున, హరుపురంబునకు = కైలాసపురమునకు, పుత్తెంచిన = పంపిన, సితవారణంబు = తెల్ల ఏనుఁగు, అభవునిఁ గూడన్ = ఈశ్వరునితో నైక్యముచెందుటకు, శంకరలోకమునకు = ఈశ్వరలోకమునకు

సీ. పురజనంబులుఁ దాను పరమేశుపురికిఁ బ్ర
ఖ్యాతిగా 'మలయు రాజయ్య' యరిగె
శివరాత్రి సేయుచు శివభక్తులును దాను
వెండికొండకు 'మిఖమిండఁ' డరిగె
నల్లుఁడు కూఁతురు నతివయుఁ దాను నీ
శ్వరుఁగూడ 'మానకంజారుఁ' డరిగె
పుత్రపౌత్రకళత్ర మిత్రాదులును దాను
దేవుఁ జేరఁగ 'జగదేవుఁ' డరిగె

ఆ. ననుట కెల్ల మొన్న మనమార కల్లయ్య
శంభుఁ జేరఁ జనఁడె సాక్షి వేతె
యేల ప్రత్యయంబు లే... ౨౬

టీ. పురజనంబులును = పట్టణములోనిజనులును, ప్రఖ్యాతిగాన్ = బాహాటముగా, పరమేశుపురికిన్, = కైలాసపట్టణమునకు, వెండికొండకు =

కైలాసపర్వతమునకు, పుత్రపౌత్రకళత్రమిత్రాదులును = కొడుకులు మనుమలు స్నేహితులు మొదలగువారును, దేవున్ = ఈశ్వరుని.

సీ. ప్రజయుఁ దాను 'కుమారపాలఘూర్జరుఁడు'
హయారూఢుఁడై పోయె హరునిపురికి
రహి నెనుబదివేలరాజులతోడ 'చే
రమరాజు' పోవఁడే రజతగిరికిఁ
దనదు వేశ్యయును దత్సఖులును దానును
బోఁడె 'మల్హాణు' రుద్రభువనమునకు
నననేల వేయు 'నిమ్మవ్వ' యేడ్దినములు
సారిదిఁ గైలాసంబు సూరఁగొనదె
ఆ. యిట్టి చిత్రమహిమ లితరసమయముల
నెనయఁ జూపి చెప్పరేని కొంత
యిచ్చగింపవచ్చునే... ౪౭

టీ. ప్రజయు = ప్రజలును, హయరూఢుఁడై = గుఱ్ఱము నెక్కినవాఁడై, హరునిపురికి = ఈశ్వరునిపట్టణమునకు, రజతగిరికి = వెండికొండకు, (కైలాసమునకు) తనదువేశ్యయును = తన యుంపుడుకత్తెయును, తత్సఖులును = ఆమె స్నేహితులును, మల్హాణు = మల్హాణుఁడు, రుద్రభువనమునకు = ఈశ్వరలోకమునకు, సారిదిన్ = క్రమముగా, చూఱఁగొనదె = స్వాధీనముచేసికొనదె, ఇతరసమయములన్ = ఇతరసిద్ధాంతములలో, ఎనయన్ = తగురీతిని, ఇచ్చగింపవచ్చును = అంగీకరింపవచ్చును.

సీ. సకలేశు 'మాదిరాజయ్య' చందంబున
నొగి నేడు నూరేడు లుండెనేని
'కుమ్మరగుండయ్య' కొమరుఁ బ్రాయము క్రియ
క్రమ్మఱఁ బడయంగఁ గలిగిరేని

'కరికాలచోడనికైవడిఁ' గనకవ
ర్ణంబు దాఁ గురియింపఁ జాలిరేని
మెఱసి 'వంకయ'భంగి మొరటుఁబత్తిరిగోసి
ముదిగొడ్డుసను బాలుపిదికిరేని
ఆ. ధ్రువమయేని కొంతయేమనవచ్చుఁ గా
కిట్టులేని కుమతు లేమి యనిన
నే మనంగవచ్చు నే... ౭౮

టీ. ఏడుసుమూరేడులు = ఏడునందల సంవత్సరములు, కోమరు బ్రాయము = యౌవనము, క్రమ్మఱన్ = తిరిగి, పడయంగఁగలిగిరేని = పొందఁగలిగినచో, కైవడిన్ = వలె, కనకవర్ణంబు = బంగారుపువర్షము, మొరటుఁబత్తిరి = విరుసుపత్రి, ముదిగొడ్డునను=ముసలి ఆవును, ధ్రువమయేని = స్థిరమైనచో.
సీ. హరియఁట దైత్యారి యగునేని యటు లేల
జాలంధరునకును నేల యోడె
హరియఁట యచ్యుతుం డౌనేని జరుఁ డని
యెడిబోయ వేటున నేల మడిసె
హరి యనంతుం డఁట యౌనేని రుద్రుచే
వీపు పెళ్ళున నేల విఱువఁ బడియె
హరియఁట దుష్టసంహర్తయే యౌనేని
యిల జరాసంధున కేల తలఁగెఁ
ఆ. గాన హరికి నివియుఁ గారణనామముల్.
గావు పూజ్యనామకములుగాని
యెట్లు తప్ప దిట్టులే... ౭౯

టీ. దైత్యారి = రాక్షసులకు శత్రువు. అచ్యుతుండు = నాశనములేనివాఁడు, బోయవేటున = బోయవాని బాణమున, అనంతుండు = అంతము

లేనివాఁడు దుష్టసంహర్త = దుష్టులను సంహరించువాఁడు, తలఁగె = తొలఁగెను. (దూరముగా నుండెను.) కారణనామసుల్ = ఆయాపనుల కారణమున వచ్చిన పేర్లు. పూజ్యనామకములు = గౌరవార్థమైన పేర్లు.

సీ. మెట్టినాఁడఁట బలిఁ గట్టి వామనుఁ డేమి
యర్థించె వాఁడేమి యతని కొసఁగె
వధియించె నటుల రావణుని రాఘవుఁడు వీఁ
డేమి నిర్జించె వాఁడేమి గడచెఁ
గాఱించెను హిరణ్యకశిపు నృసింహుఁడు వీఁ
డేమి ఖండించె వాఁడేమి గనియె
హరియించె నట హిరణ్యాక్షు సూకరుఁడు వీ
డేమి భంగించె వాఁడేమి మడిసె
ఆ. యంతవట్టు నీశ్వరాజ్ఞ య కాకయ
పగరఁ బడయసున్నవారె కర్త
లిందు నందు నే... ౫౦

టీ. మెట్టినాఁడఁట = అణఁగఁ ద్రొక్కినాఁడఁట. వాఁడు ఏమియర్థించెన్ = ఏమికోరెను, వాఁడు = బలి, నిర్జించెన్ = జయించెను. కాఱించెను = హింసించెను, వాఁడు = హిరణ్యకశిపుఁడు, కనియెన్ = పొందెను. సూకరుఁడు = వరాహమూర్తి, భంగించెన్ = పాడు చేసెను, వాఁడు హిరణ్యాక్షుఁడు. మడిసెన్ = పాడయ్యెను, యంతవట్టును = అంత వఱకును.

సీ. వసుధ నేడ్వూరు ద్రవ్వఁగఁ బంపఁడే జైన
తతులను 'దేవర దాసమయ్య'
వశిగాలి కొట్టుల వైపింపఁడే జైన
పటలంబు జ్ఞానసంబంధి మధుర

జినలాంఛనులఁ గని యిసుపక్షులఁ ద్రోవ్వ
నసుపఁడె 'నిడుమూఁక జనవిభుండు'
దహనేవ జలధిప్రోద్ధనిలోన జైనప
న్నులఁ ద్రుంపఁడే తినాత్రికయ యరసు ?
ఆ. గాన భక్తతతికి గణుతింప చీల్మండ
బంటిగావు జైనపల్వలంబు
లెన్న నేల వేయునే... ౫౧.

టీ. శివభక్తులు జైనులను సంహరించుటకు సమయింపఁజేయుట దీనివలన తెలియుచున్నది. జైనులనెడి చిన్న సరస్సులను దాఁటుట శైవులకు చీలమండ బంటి.

సీ. జైనంబు శ్రుతిబాహ్యమానంబు ప్రత్యయ
హీనంబు నిరయసంధాన మగుట
జైనంబు స్వర్గానుమానంబు విగతావ
ధానంబు వరమాత్రసూన మగుట
జైనంబు పుణ్యవిహీనంబు బంధావి
లీనంబు మిథ్యాభిమాన మగుట
జైనంబు కృత్రిమానూనంబు ధూపిత
జ్ఞానంబు క్షణికావధాన మగుట
ఆ. సాంఖ్యతోండఁడాది జైనంబు నిరసించి
భక్తుఁడై మహానుభావుఁ డగుట
యెఱుఁగరయ్య జైనులే... ౫౨.

టీ. జైనంబు = జైనమతము, శ్రుతిబాహ్యమానంబు = శ్రుతులకు దూరమైనప్రమాణశాస్త్రము, ప్రత్యయహీనంబు = నమ్మతగనిది, నిరయసంధా

నము = నరకమును కూర్చునది, స్వర్గానుమానంబు = స్వర్గము విషయమై సందేహముకలది, విగతావధానంబు =ఏకాగ్రతలేనిది, మిథ్యాభిమానము = వ్యర్థమయిన అభిమానముగలది, పుణ్యవిహీనంబు = పుణ్యరహితమైనది, బాధావిలీనంబు = బాధముచే కలుషమయినది, కృత్రిమానూనంబు = మిక్కిలి కృత్రిమముతో గూడినది, ఘూర్ణితజ్ఞానంబు = జ్ఞానమును చెదరఁగొట్టునది, క్షణికావధానము = క్షణకాలముమాత్రమే నిలుచు చిత్తైకాగ్రతగలది.

సీ. బౌద్ధంబు వేదవిరుద్ధంబు భవపాశ
        బద్ధంబు దుఃఖసమృద్ధి యనియు
    బౌద్ధంబు విగతవిశుద్ధంబ సత్యాను
        బద్ధంబు శాస్త్రవిరుద్ధ మనియు
    బౌద్ధంబు లోకనిషిద్ధంబు సుకృతావ
        బద్ధంబు దుష్కర్మబద్ధ మనియు
    బౌద్ధంబు మోహసంబద్ధంబు విజ్ఞాన
        విద్ధంబు సాక్షాదబద్ధ మనియు
ఆ. 'సాంఖ్యతొండఁ' డాది సమయంబు నిరసించి
    భక్తుఁడై మహానుభావుఁ డగుట
    యెఱుఁగరయ్య బౌద్ధులే జైనులే... ౫౩

టీ. బౌద్ధంబు=బౌద్ధమతము, వేదవిరుద్ధంబు=వేదములకు విరుద్ధమయినది, భవపాశబద్ధంబు = సంసారపాశముచే బంధించునది, దుఃఖసమృద్ధి = దుఃఖములయొక్క పెంపుతోఁగూడినది, విగతవిశుద్ధంబు = శుద్ధిలేనిది, అసత్యానుబద్ధంబు=అసత్యముతోఁ గూడినది, లోకనిషిద్ధంబు = లోకములో నిషేధింపఁబడినది, సుకృతావబద్ధంబు = పుణ్యవిరహితమైనది, దుష్కర్మబద్ధము = చెడుపనులతోఁగూడినది, మోహసంబద్ధంబు = మోహముతోఁగూడినది, విజ్ఞానవిద్ధంబు = క్షణికవిజ్ఞానవాదముతోఁగూడినది, సాక్షాదబద్ధము = ప్రత్య

క్షమైన అబద్ధము (అని సాంఖ్యతొండఁడు మున్నగువారు ఆసిద్ధాంతమును వదలి శివభక్తులై మహానుభావులగుటచే జైనబౌద్ధములను వదలి శైవము గ్రహింపవలయుననుట.

సీ. పరమశూన్యవచోవిపాకంబు దుష్క్రియా
        నీకంబు మిగులఁ జార్వాక మనియు
    నాస్తికతాన్వర్థనరకలోకంబు దు
        ర్వర్తనైకంబు చార్వాక మనియు
    విప్రవిరుద్ధవివేకంబు విహితదు
        ర్వాక్యలోకంబు చార్వాక మనియు
    కలికాలకలుషసంగతి కాదినికరంబు
        పాతకైకంబు చార్వాక మనియు
ఆ. 'సాంఖ్యతొండఁ' డాదిసమయంబు నిరసించి
    భక్తుఁడై మహానుభావుఁ డగుట
    యెఱుఁగరయ్య వాడు లే... ౫౮

టీ. పరమశూన్యవచోవిపాకంబు = మిక్కిలిగ శూన్యవాదమును దెలుపు వాక్పరిణామముగల, దుష్క్రియానీకంబు = చెడుపనులసమూహము గలది, నాస్తికతాన్వర్థనరకలోకంబు = దేవుఁడు లేడనుటకు సార్థకముగ నరకలోకము నిచ్చునది, దుర్వర్తనైకంబు = చెడువర్తనము ప్రధానముగా గలది, విప్రవిరుద్ధవివేకంబు = బ్రాహ్మణులకు విరుద్ధమయిన జ్ఞానమును దెలుపునది, విహితదుర్వాక్యలోకంబు = మార్పఁబడిన చెడువాక్యసమూహముగలది, కలికాలకలుషసంగతికి = కలికాలమునందలి పాపములు దగులుటకు, ఆదినికరంబు = మొట్టమొదటిస్థానము, పాతకైకంబు = పాపములు ప్రధానముగాఁ గలది, చార్వాకమతమని సాంఖ్యతొండఁడు తొల్లిటిచార్వాకసిద్ధాంతమును, (దేవుఁడు లేఁడు, శూన్యముచుండియే జగత్తు బయలుదేరును, శూన్యమునందే

లీనమగును, దేహము నశించినతరువాత మిగులున దేదియు నుండదను మత ము, నవలెను.

సీ. తను వధించినమనుష్యుని నేఁడు నాళ్లకుఁ
బడయఁడే 'కిన్నెర బ్రహ్మవిభుఁడు'
పదునేడుదినముల 'బసవన్న' బడయఁడే
యవలీల 'మునిడి చౌడయ్యగారు'
మొసలి మ్రింగినయట్టి వసుధామరునిపుత్రుఁ
బడయఁడే యేడేండ్ల 'కొండయసంబి'
పెక్కేమి శల్యముల్ చిక్కియున్న వధూటిఁ
బడయఁడే యేడేండ్ల 'కొండపిళ్ల'
ఆ. గాన భక్తవరులు కాలవశంబన
భేద మనెడికాలవాదినోరు
నెడమకాలఁ దాఁతురే... ॥

టీ. ఏడునాళ్లకు = ఏడురోజులకు, పడయఁడే = పొందఁడా! వసుధామరునిపుత్రున్ = బ్రాహ్మణకుమారుని, పెక్కేమి = పెక్కుమాటలేల? కల్యముల్ చిక్కియున్న = ఎముకలుమాత్రము మిగిలియున్న, వధూటికిన్ = భార్యను, కాలవాదినోరున్ = కాలమే దైవమని వాదించువానినోరును, ఎడమకాలన్ = ఎడమకాలితో, తాఁచుదు = తన్నుదురు.

సీ. తూలు నాగాలిచేఁ దూలునా మెట్టలు?
తూలవు మేఘముల్ తూలుఁగాని
తేలు నావఱదచేఁ దేలునా గుండ్లును?
దేలవు బెండ్లును దేలుఁగాని
పేరు నాచల్లచేఁ బేరునా క్షీరాబ్ధి?
పేర దావులపాలు పేరుఁగాని

క్రాఁగునా వహ్నిచేఁ గ్రాఁగునా సురమణుల్?
గ్రాఁగవు లోహముల్ గ్రాఁగుఁగాని

ఆ. యట్లకాలవశత నణఁగరుభక్తులు
కుటిలమానవులణఁగుదురుగాని
యీహితానుషంగమే... ౫౬

టీ. తూలునాగాలిచే = ఎగిరెడిగాలిచే, మెట్టుతూలునా=పర్వతము లెగురునా! తూలవు = ఎగురవు, మేఘముల్ దూలుఁగాని = మేఘములు ఎగురునుగాని, తేలునావఱవచేన్ = మీఁదికి తేలు ప్రవాహముచే, గుండ్లును = ఇనుపగుండ్లు, బెండ్లును=తేలికయైన కఱ్ఱముక్కలు, పేరు నాచల్లచే = ఘనీభవింపఁజేయుమజ్జిగచే, క్షీరాబ్ధి=పాలసముద్రము, పేరునా=తోడుకొనునా? సురమణుల్ = దేవతామణులు, క్రాఁగన్ = కరగును. ఆరీతిగనే కాలవశమున భక్తులు అణఁగిపోరు. కుటిలమైన మనుజులే అణఁగిపోయెదరు.

సీ. కల ఘంగఁ దిరుగునే కాక పంటకముల
చవులు దా నెఱుఁగునే చట్టువంబు
కనకమై మోయునే కాక శ్రీగంధంబు
మేలేమి యెఱుఁగునే గాలిగాఁడు
కలిసి యొక్కటనుండు గాక యానెత్తమ్మి
కంపె మెఱుంగునే కాకిచిప్ప
కైకొని యుండునే కాక రత్నంబుల
మర్యాద యెఱుఁగునే మ్రానిపెట్టె

ఆ. యట్లు చదువుఁగాక యాగమనిగమార్థ
సారభక్తిమహిమ జగతి వెఱ్ఱు
లేమి యెఱుఁగ నేర్తురే... ౫౭

టీ. కలయంగన్ = బాగుగా, వంటకములచవులు = వండిన పదార్థములరుచులు, చట్టువంబు = వాట్టత్రెడ్డు, కనక = చూడక, మైమోయునే గాక = ఒడలిమీఁద మోయునేకాక, శ్రీగంధంబునేలు = మంచిగంధము యొక్క మంచితనము, గాలిగాఁడు = గాడిద, కలిసి = కూడి, ఒక్కటన్ = ఒక్కచోట, ఉండుఁగాక = ఉండిన నుండనీ, అసెత్తమ్మికంపు = పద్మము యొక్క పరిమళము, కాకిచిప్ప = నత్తగుల్ల, కైకొనియుండునేగాక = లోపల పెట్టుకొనియుండును గాని, రత్నంబులమర్యాద = రత్నములవిలువ, మ్రాను పెట్టె = కట్టెపెట్టె, అట్లే, చదువుఁగాక = వేదశాస్త్రాదులు చదువుదురుఁగాక, ఆగమనిగమార్థసారభక్తిమహిమ=ఆగమములలోను వేదములలోను సారమయిన భక్తియొక్క మహిమను, అజ్ఞానులేమి తెలియనేర్తురు !

సీ. యుక్తంబుగా నాది "యూర్ధ్వపుండ్రం ద్విజః
　　　కుర్యా" త్తనంగ నుదారఫణితి
నత్తరువాత నత్యంచితంబుగ "విల
　　　యాపికదాచన"యనఁగ మఱియు
నయ్యుపరార్థమం "దద్భుతాకారేణ
　　　చత్రిధా" యన సమానంబు మీఱ
నదియును జన్న"భిద్యతి యమకింకరై"
　　　రని సంఘటించు శ్రీస్కాందసూక్తి

ఆ. యిట్లు శ్రుతులుపల్క నెట్లొకో జనులూర్ధ్వ
　　పుండ్ర ధారణములన పొలిసిపోదు
　　రిహితానుషంగయే. . . 　　　　　　　　గిరా

టీ. ద్విజః = బ్రాహ్మణుఁడు, ఊర్ధ్వపుండ్రం కుర్యాత్ = ఊర్ధ్వ పుండ్రమును ధరింపవలయును, అద్భుతాకారేణచత్రిధా = అద్భుతమైన

ఆకార మేర్పడునట్లు మూఁడు రేఖలుగలుగ వ్రాసికొని, ఇడియుము చన్నన్ = అట్లు చేయనిచో. యమకింకరైర్భిన్నతి = యమకింకరులచే భేదింపఁబడుచు, పోవసిపోదురు=విరక్తులగుదురు.

సీ. క్రమమున "నూర్ధ్వపుండ్రంచ శూలంచ నా"
నూర్ధ్వపుండ్రంబు శూలోపమంబుఁ
జన "వర్తులం చార్ధచంద్రకం" బన వట్రు
నై నెలవంకలై యర్థి నొసల
నిట "లలాటే ధారయిష్యంతి నామను
షాః పాపకర్మిణ" యనఁగ నిట్లు
దుర్మనుష్యులు పాపకర్ము లంచును బరా
శరపురాణసూక్తిసరణి మ్రోయ
ఆ. నిట్లు శ్రుతులుపలుక నెట్లొకో జనులూర్ధ్వ
పుండ్రధారణములఁ బొలిసిపోదు
రీహితానుషంగ... శ్రీ

టీ. ఊర్ధ్వపుండ్రంచ త్రిశూలంచ=ఊర్ధ్వపుండ్రము త్రిశూలము, నాన్ = అనుటవలన, ఊర్ధ్వపుండ్రంబు = నిలువుగా పెట్టుకొనిన భస్మపురేఖ, శూలోపమంబు = త్రిశూలముతో సమానమైనది. వర్తులం చార్ధచంద్రకంచ =గుండ్రనిది, అర్ధచంద్రాకారమైనది, వట్రువలై = గుండ్రనివై నెలవంకలై= చంద్రవంకవలె నుండినవై, అమనుషాః = మనుజులు కాని వారు, పాపకర్మిణః = పాపపుఁబని చేయువారు, లలాటే సధారయిష్యంతి = నొసట విభూతిని ధరింపరు.

సీ. లాలితంబుగ "వర్తులంచోర్ధ్వపుండ్రజం"
బనుచు సాంఖ్యమున భావ్యముగ మ్రోయు
గతి "నధార్యం వైదికైర్జనై" రని మాన
వపురాణమునను భావ్యముగ మ్రోయు

ప్రకటించి "యూర్ధ్వపుండ్రముఖం న దృష్ట్వాచ"
యనుచు మనుస్మృతియందు మ్రోయు
భువి "నశుద్ధం చోర్ధ్వపుండ్రంచ చక్రాంక"
మనుచు సాంబపురాణమునను మ్రోయు
ఆ. నట్లు శ్రుతులు పలుక నెట్లొకో జను లూర్ధ్వ
పుండ్ర ధారణములఁ బొలిసిపోదు
రీహితానుషంగ...... ౬౦

టీ. ఊర్ధ్వపుండ్రజం=ఊర్ధ్వపుండ్రముగ ధరించినభూతి, వర్తులంచ=వర్తులాకారమైనదియును, వైదికైఃజనైః = వేదమార్గమందు సంచరించెడి జనులచే,నధార్యం=ధరింపఁదగనిది, ఊర్ధ్వపుండ్రముఖం=ఊర్ధ్వపుండ్రముతోఁ గూడిన ముఖమును, నదృష్ట్వాచ=చూడకయును; ఊర్ధ్వపుండ్రంచ చక్రాంకంచ ఊర్ధ్వముగా నామమును, చక్రాంకితమును, నదృష్ట్వాచ=చూడక, (ఈ పద్యమున విధినిషేధములు రెండును గూడి భూతి ధరింపఁదగినదనియు, తప్త చక్రాంకితములను ఊర్ధ్వపుండ్రమును (నామములు తాల్చుటను) కూడదనియు, దెలియఁజేయఁబడినది.)

సీ. ఇల "నాంకయేన్నదహేద్దేహ" మని సమ
ర్థించుబోధాయన శ్రుతి వచించి
లలి "దేవతాయుధలాంఛనై" యని నిర
సించు శాతాతపశ్రుతి వచించి
"లోహత ప్తతనుర్లోహదండిన" యుచ్చ
రించున నయ్యమశ్రుతి వచించి
నెన "నాంకయేన్నదహేద్గాత్ర" మనుచు ని
షేధించు నయ్యమశ్రుతి వచించి

ఆ. యిట్టిశ్రుతులు పల్క నెట్లొకో శంఖచ
క్రాంకణముల మర్త్యు లణగిపోదు
రిహితానుషంగయే... ౬౧

టీ. దేహమ్ = దేహమును, నాంకయేత్ = ముద్రించుకొనకూడదు, నదహేత్ = తప్తము చేయకూడదు(వైష్ణవమతములో చెప్పినరీతిని తప్త ముద్రాంకితము చేయకూడదనుట), దేవతాయుధలాంఛనైః=దేవతల ఆయుధ ములను గుర్తుగా ధరించుటచేతను, నిరసించున్=కాపెదను, లోహాప్తప్తకనుః= లోహముచేత కాల్చబడిన శరీరముగలవాడు, లోహదండి = లోహదండము దాల్చువాడు, న = కాకూడదు, నాంకయేత్ = ముద్రించుకొనకూడదు, నదహేత్ = కాల్చకూడదు.

సీ. "ఆయుధైశ్శంఖచక్రాద్యై" రనుచుం బ్రసి
ద్ధముగ మానవపురాణము ఘటింప
సరి "నసంభావ్యాద్విజాతయో" యని యప్పు
రాణంబు మఱియు తారక ఘటింప
షొరి "నదహేచ్చక్రపూర్వకై" రని పరా
శరపురాణమును మానత ఘటింప
"నవినాధికశ్శివలాంఛితో" యనుచు శ్రీ
యజ్ఞవైభవఖండ మదె ఘటింప
ఆ. నిట్లు శ్రుతులుపలుక నెట్లొకో శంఖచ
క్రాంకణముల మర్త్యు లణగిపోదు
రిహితానుషంగయే... ౬౨

టీ. శంఖచక్రాద్యైః = శంఖముచక్రము మొదలయిన, ఆయుధైః = ఆయుధములతో, న = ఉండకూడదు, నసంభావ్యాద్విజాతయః = అట్టి చిహ్నలుగల బ్రాహ్మణులు గౌరవింపదగినవారుగాదు, చక్రపూర్వకైః =

చక్రము మొదలగువానిచే కాల్చఁగూడదు, నవినా అధికశ్శివలాంఛితః = శివుని దాల్చుటకంటె అధికముకూడదు.

## శంకరుఁడు బ్రాహ్మణుఁడగుట

సీ. భాసురంబుగ "మహాబ్రాహ్మణమీశాన"
మనుసూక్తి శివుఁడెబ్రాహ్మణుఁడుగాక
యంచితంబుగ "విరూపాక్షంద్విజోత్తమం"
బనుసూక్తి శివుఁడె బ్రాహ్మణుఁడుగాక
నలిమీఱఁగా "బ్రాహ్మణోరుద్ర ఏవేతి"
యనుసూక్తి శివుఁడె బ్రాహ్మణుఁడుగాక
యుపమింపఁగా "బ్రాహ్మణోభగవాన్రుద్ర"
యనుసూక్తి శివుఁడె బ్రాహ్మణుఁడుగాక
ఆ. హరియు నజుఁడు తెలియ నాక్షత్రియుండుకో
మటియుఁగాఁగ వేదమతము పేర్మి
నీహితానుషంగ... 63

టీ. మహాబ్రాహ్మణం ఈశానం = గొప్పబ్రాహ్మణుఁడైన ఈశ్వరుని, అను సూక్తిన్ = అనువచనముచే, శివుఁడె, బ్రాహ్మణుఁడుగాక, ద్విజోత్తమమ్ = ఉత్తమబ్రాహ్మణుఁడైన, విరూపాక్షమ్ = ఈశ్వరుని, భగవాన్రుద్రః = భగవంతుఁడైనరుద్రుఁడు, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, హరియున్ = విష్ణుమూర్తియు, అజుఁడున్ = బ్రహ్మదేవుఁడు, (క్షత్రియుఁడు కోమటి కాఁగా శివుఁడు బ్రాహ్మణుఁడని వేదము పొగుచేఁ దెలియుచున్నది.)

సీ. రతి "ఋతం సత్యం పరంబ్రహ్మ"మనఁగ మా
పరమేశ్వరుఁడె పరబ్రహ్మగాక
పరువడి "తత్పరం బ్రహ్మే"తి యనఁగ మా
పరమేశ్వరుఁడె పరబ్రహ్మగాక

మొగి "బ్రహ్మణే లింగమూర్తయే" యనఁగ మా
పరమేశ్వరుఁడె పరబ్రహ్మగాక
పరగంగ "నో మితి బ్రహ్మణే" యనఁగ మా
పరమేశ్వరుఁడె పరబ్రహ్మగాక

ఆ. వేదసూక్తిగలదె వేఱె పరబ్రహ్మ
మిదియె నిశ్చయార్థ మెఱుఁగ కితరు
లెట్లు ఆచిన నేమియే... ౩౪

టీ. పరం బ్రహ్మ=పరబ్రహ్మము, ఋతం సత్యం=త్రికాలములయందుం డెడి సత్యస్వరూపము అనిచెప్పినపరబ్రహ్మ మీశ్వరుఁడుగాక వేఱొకఁడగు నా? తత్ పరం బ్రహ్మ=దేహేంద్రియాదులకంటె వేఱయి సూక్ష్మమయినది పర బ్రహ్మస్వరూపము. లింగమూర్తయే=లింగాకారమున వ్యక్తమయిన, బ్రహ్మణే= పరబ్రహ్మకొఱకు, ఓమితి బ్రహ్మణే=ఓంకారస్వరూపుఁడు, ఓంకారప్రతిపాద్యుఁ డు అగుపరబ్రహ్మము, వేదసూక్తిన్=వేదవాక్యములలో; వేఱె పరబ్రహ్మగలదే?

సీ. చతురాస్యతండ్రి విష్వక్సేను సంహరిం
పఁగ నాఁడు పొందని బ్రహ్మహత్య
కమలజపుత్త్రు దక్షప్రజాపతి హరిం
పఁగ నాఁడు పొందని బ్రహ్మహత్య
తనకూఁతుఁ గవయు పితామహు నేచి చం
పఁగ నాఁడు పొందని బ్రహ్మహత్య
బ్రహ్మాండములు హరిబ్రహ్మలు వెలయఁ జం
పఁగ నాఁడుపొందని బ్రహ్మహత్య

ఆ. యజునిశిరముఁ ద్రుంపునంతనే పొందెనా
యిది య నిశ్చయార్థ మెఱుఁగ కితరు
లెట్లుఆచిన నే... ౫

టీ. చతురాస్యులంద్రిన్ = బ్రహ్మదేవుని యంద్రియైన, విష్వక్సేనున్=విష్వక్సేనుని, కమలజపుత్రున్=బ్రహ్మదేవునికొడుకైన, దక్షప్రజాపతిన్=దక్ష ప్రజాపతిని, కూతుంగవయూ=కూతురితో గూడుకొను, పితామహున్=బ్రహ్మదేవుని. బ్రహ్మాండములు=సమస్తలోకములు, హరిబ్రహ్మలు=విష్ణువును బ్రహ్మదేవుఁడును, వెలయంగన్=ఎదురుగా నుండఁగా. బ్రహ్మహత్య = బ్రాహ్మణుని వధించుటవలన, గలుగుపాపము, అజునిశిరము=బ్రహ్మదేవుని శిరస్సును, త్రుంపు నంతనే = త్రుంచివేసినంతనే, వచ్చెనా ?

సీ. సరి "న సంఖ్యాతాశ్చ హరయో" యనెడినట్లు
గాన విష్ణువులు పెక్కండ్రు గలరు
తగ "నసంఖ్యాతాః పితామహాః" యనియెడుఁ
గాన బ్రహ్మలును పెక్కండ్రు గలరు
యిల "నసంఖ్యాతాస్సురేంద్రాశ్చ" యనియెడుఁ
గాన నింద్రులును బెక్కండ్రుగలరు
గతి "నసంఖ్యాతాశ్చ కాలాశ్చ" యనియెడుఁ
గానఁ గాలురును బెక్కండ్రుగలరు

ఆ. ఎల్లశ్రుతులు "నిత్యఏకోమహేశ్వరో"
యనుట నొక్కరుండె యభవుఁ డనుచు
నిట్లు నిశ్చయింప కే... ౬౬

టీ. అసంఖ్యాతాః = లెక్కపెట్టుటకు శక్యముగానివారు, హరయః = విష్ణువులు, పెక్కండ్రు = చాలమంది, పితామహాః = బ్రహ్మలు, సురేంద్రాశ్చ = దేవేంద్రులును, కాలాశ్చ=కాలరుద్రులు. నిత్యః=నిత్యుఁడైన, మహేశ్వరః = పరమేశ్వరుఁడు, ఏకః = ఒక్కఁడు.

సీ. కాము హరించుటఁ గామహరుం డనఁ
గాముండు హరుఁడు నొక్కరుఁడ యగునె ?

కాలు హరించుటఁ గాల హరుం డనఁ
గాలుండు హరుఁడు నొక్కరుఁడ యగునె ?
పురములు హరియింపఁ బురహరుం డన నొప్పఁ
బురములు హరుఁడు నొక్కరుఁడ యగునె ?
హరిని హరించుట హరిహరుం డనఁగ నా
హరియు హరుండు నొక్కరుఁడ యగునె?

ఆ. యాగమంబులందు హరిగహ్వరాంతర
మనెడి నిశ్చయార్థ మరయ కితరు
లెట్లు జెచిన నేమి... ౬౭

టీ. కాము హరించుటన్ = మన్మథుని భస్మముచేయుటచే, కామహరుం డనన్ = కామహరుం డని యనఁగా, కాముఁడు = మన్మథుఁడు, హరుఁడు = ఈశ్వరుఁడు, ఒక్కరుఁడ = ఒక్కఁడే యగునా? కాలున్ = యముని, కాలుండు = యమధర్మరాజు, పురములు = మూఁడుపురములు, హరిని = విష్ణువును,

సీ. నీవు త్రివిక్రము నెట్టణ కోలెమ్ము
ప్రళ్లనవిఱచి చేపట్టకున్న
నీవు విష్వక్సేను నిశితశూలమ్మున
జిత్తరంబుగఁ జిమ్మి యెత్తకున్న
నీవాపెనరసింహు నెఱయ తిత్తొలిపించి
పెంపార గద్దెఁ బెట్టింపకున్న
నీవాదిక్రోడంబు నిర్జించి తన్ని యా
దంష్ట్రంబు నురమునఁ దాల్పకున్న

ఆ. హరిహరాహ్వయమున కర్థ మెఱుంగక
హరిహరుండు నొక్కఁ డనెడువాండ్ర
నెట్లు దెలుపవచ్చు... ౬౮

టీ. త్రివిక్రమున్ = త్రివిక్రమావతారుఁడైన విష్ణువుని, నెట్టిణన్= వెంటనే, గోళ్లెమ్ము = వెన్నెముక, చిత్తరంబుగ = చిత్రముగా, చిమ్మి =మీఁది కెగురవైచి, తిత్తి = చర్మము, గద్దెన్ = సింహాసనముపై, ఆదిక్రోడంబు=ఆది వరాహావతారమును, దంష్ట్రంబు=కోఱ, హరిహరాహ్వయమునకు = హరిహరుఁడు అను పేరునకు, హరి హరుండు నొక్కఁడు = ఇద్దఱు ఒక్కరే, అనిచెప్పెడు వారికి ఏమిచెప్పవలె.

సీ. నీవు వేదవ్యాసునిజభుజాస్తంభంబు
 దెంపించి కేల నెత్తింపకున్న
యాహవనీయాగ్ని హరిశిరంబు నడంగ
 నేచి నీకింకరుఁ డేయకున్న
వైకుంఠురక్తంబు వారక నీచేతి
 పలకపాలంబునఁ బట్టకున్న
మత్స్యావతారాది మధుసూదనావతా
 రంబులు నీచేత మ్రగ్గకున్న
ఆ. హరిహరాహ్వయమున కర్థ మెఱుంగక
హరిహరుండు నొక్కఁ డనెడువాండ్ర
నేమి దెలుపవచ్చునే...... 20

టీ. వేదవ్యాసు = వేదవ్యాసుని, నిజభుజాస్తంభంబు=తన భుజమనెడి స్తంభమును, కేలన్ = చేతితో, నీకింకరుఁడు = నీ సేవకుఁడు, ఏయకున్నన్ = వేయకుండిన, మ్రగ్గకున్న = అణఁగి పోకుండిన.

శివుఁడు సిట్యుఁ డగుట

సీ. నీకపర్దంబున నెఱిఁజుట్టిన యనేక
 కమలజాచ్యుతకపాలములు సాక్షి
నీయురస్థ్సలమున నెఱినొప్పు వారాహ
 దంష్ట్రాస్థికూర్మాస్థితతులు సాక్షి

నీయామ్యభుజమున నేఁడు పాయకయున్న
పద్మనాభునికళేబరము సాక్షి
నీయురస్స్థలము సన్నిహితమై యున్ననా
నామరస్థూలశల్యములు సాక్షి
ఆ. నీజగత్ప్రసిద్ధ నిత్యత్వమునకు బ్రహ్మ
విష్ణువాదిసుర లనిత్యు లగుట
కేలప్రత్యయంబు లే... ౭౧

టీ. నీకపర్దంబున = నీజటాజూటమునం, నెఱిన్ = అందముగా, కమలజాచ్యుతకపాలములు = బ్రహ్మ విష్ణువులపుఱ్ఱెలు, నీయురస్స్థలమున = నీ రొమ్మునందు, వారాహవిం...పతులు = వరాహావతారముయొక్క కూర్మావతారము యొక్క యెముకల ప్రోగులు, నీయామ్యభుజమున=నీయెడమభుజమునందు, పాయకయున్న = విడిపెట్టకుండ యున్న, పద్మనాభునికళేబరము = విష్ణుమూర్తియొక్కశరీరము (శివునియెడమభాగము గౌరి, ఆమె విష్ణుస్వరూపిణి యగుట నిట్లువర్ణింపఁబడినది.) నానామరస్థూలశల్యములు = అనేకదేవతల పెద్దపెద్దయెముకలు, నీజగత్ప్రసిద్ధనిత్యత్వమునకు = నీయొక్క లోకములలోఁ బ్రసిద్ధమైన, నిత్యుఁడగుటకును, బ్రహ్మవిష్ణువాదిసురలు=బ్రహ్మ విష్ణువు మొదలగుదేవతలు, అనిత్యులగుటకు = నిత్యమైనవారు కాకుండుటకు, ఏలప్రత్యయంబులు = తార్కాణములేల !

సీ. విద్యావిదుం డైన విప్రుఁడు మృతుఁ డైన
నగుఁగాక విద్యకు హాని గలదె ?
తరి నగి దీన యద్దముపడ్డఁ జెడు గాక
ప్రతిబింబమునకు విపత్తుగలదె ?
యిలజలం బింకిన నింకుఁ గా కందుఁ దా
చందురునకు మఱి క్షయము గలదె ?

కడవపోయినఁ బోవుఁగాక తన్మధ్యసం
పుటమైన బయటకుఁ బోకగలదె?
ఆ. యట్లు సర్వమును లయంబుఁ బొందినను స
ర్వాత్ముఁడైన యంబికాధవునకు
నెందులయము గలదె యే... ౭౨

టీ. విద్యావిదుఁడైన = విద్యలను తెలిసిన, విప్రుఁడు = బ్రాహ్మణుఁడు, మృతుండైనన్ = చనిపోయినను, విద్యకు = చదువునకు, ప్రతిబింబమునకు = అద్దములో కనఁబడు పడనీడకు, జలంబు = నీరు, ఇంకినన్ = ఇంకిపోయిన, చందురునకు = నీటిలో ప్రతిఫలించుచంద్రునకు. క్షయము = నాశము, తన్మధ్యసంపుటమైన = కడవలోపలనున్న, బయలునకు = ఆకాశమునకు, పోక = పోవుట, లయంబు = నాశము, అంబికాధవునకు, గౌరీభర్త యగునీశ్వరునకు.

సీ. మృత్యువుఁ బడవైచి మెడద్రొక్కి కోఱలు
పెరకఁడే యొకగణం బిరవునొంది
సకలాబ్ధిజలములు నొకగణం బొక్కటఁ
దెగఁద్రావి గట్టునఁ దేప్పవట్టె
దీవు లేడును ద్రిప్పి తిరుగుచక్రమునట్లు
పడి నొక్కగణపండు వైచె నట్టి
బడబాగ్నిఁ దిగిచి బొట్టిడుకొని యొకగణం
బానందమున సోలియాడె నట్టి
ఆ. యిట్టి చిత్రమహిమ లెవ్వరికున్నవి
తలఁప మీఁగణేశ్వరులకె గాక
యేమి చెప్పవచ్చునే... ౭౩

టీ. ఇరవునొంది = అవకాశమును జూచుకొని, సకలాబ్ధిజలములు =

సముద్రములోని నీళ్లన్నియు, త్రేన్చిపెట్టెను = త్రేన్చెను, తిగిచి = బయటికి లాగి. సోలియాడె = మైకముతో నాడెను.

సీ. ఎనుబోతు కొమ్ములు నైరావతముదంత
        ములు దూసి కోలాటముల కమర్చి
    మందర మలయాదిమహనీయభూధర
        ములు కేళికర్పటములుగఁ జేసి
    యాదికూర్మము పృష్ఠమందు వాసుకిఁ గూర్చి
        కాలఁ ద్రిప్పి త్రిప్పటంబుగ నొనర్చి
    కోరి త్రివిక్రముకోలెమ్ము నను బ్రహ్మ
        తలపునుక నునిచి ఛత్రం బొనర్చి
ఆ. యయ్య మీగణంబు లాడుచుండుట కల్ప
    వేళ నిఖిలలోకవిస్మయంబు
    లెల్ల నీవెఱుంగు దేకాస్త్ర... ౨౮

టీ. ఎనుబోతుకొమ్ములు = దున్నపోతుకొమ్ములు. నైరావతముదంతములు = ఇంద్రుని యేనుఁగుదంతములు, మందర...భూధరములు = మందరము మలయము మొదలగుపర్వతములు, కేళికర్పటములు=ఆటకయిన తాళపుచిప్పలు. త్రిప్పటంబు = బొంగరము, కోలెమ్ము = వెన్నెముక, బ్రహ్మతలపునుక = బ్రహ్మశిరస్సునందలి పుఱ్ఱె, అనిచి = ఉంచి, ఛత్రము = గొడుగు.

సీ. కులగిరుల్ పేరుగా గ్రుచ్చి యొప్ప ధరించు
        పర్వతాభరణుఁడ న్భద్రగణము
    వారకలయవేళ మేరువతనుగాఁగ
        మేరుపాతనుఁ డను మేటిగణము
    బ్రహ్మాండతతులు హారముగ వైచి నటించు
        రుండాభరణుఁ డను దండి గణము

అజహరికుండంబు లాభరణముఁ జేయు
రుండాభరణుఁ డనురుద్రగణము

ఆ. ఇట్టి చిత్రమహిమ లెవ్వరికున్నవి
తలఁప మీగణేశ్వరులకె గాక
యేమి చెప్పవచ్చునే... ౭౫

టీ. కులగిరుల్ = కులపర్వతములు, పర్వతాభరణుఁడన్ = పర్వతములు ఆభరణముగాఁగలవారను, వారక = వెనుకకు దిగియక, లయవేళన్ = ప్రళయ సమయమునందు, మేరుపాతనుఁడు = మేరుపర్వతమును బడవేసినవాఁడు, బ్రహ్మాండపతులు = బ్రహ్మాండములగుంపులు, రుండాభరణుఁడు = పుఱ్ఱెలు ఆభరణముగాఁగలవాఁడు, అజహరికుండంబులు = బ్రహ్మ విష్ణువులపుఱ్ఱెలు చిత్రమహిమలు, విచిత్రమైన గొప్పతనములు.

సీ. భవు భజించినవాఁడు పౌండ్రకవాసుదే
వుం డయ్యె నే భృగు దండిశాప
హరి పదిమార్లు తిర్యఙ్యోనులందు మా
నవయోనులందు దైన్యమునఁ బుట్టి
చెడువనావస్థల సొలయుచు శివలింగ
ముల దశయవతారములను లింగ
ములఁ బ్రతిష్ఠించి యిమ్ముల మత్స్యకేశ్వర
కూర్మేశ్వరాదులఁ గొల్చి ధన్యుఁ

ఆ. డైనవిధిని మఱచి హరుచేత మడిసిన
వాఁడు దేవుఁ డొక్కొ వడి యథార్థ
మెఱుఁగ కఱతు రజ్ఞులే... ౭౬

టీ. ఈశ్వరుని సేవించిన పౌండ్రకవాసుదేవునకు ఏమియు నిక్కట్టులు

లేపయ్యె. ఇఁక వాసుదేవునకన్ననో, భృగుమహర్షి యొసఁగిన ప్రబలశాపముచేఁ బదిమార్లు పుడుయోనులందుఁ బుట్టవలసివచ్చెను. చెడువనావస్థలన్ = చెడు అడవులపాల్లుతో, సొలయుచు=బాధపడుచు, దశయవతారములను=పదియవతారములందును (ఆయాపేర్లతో లింగములను స్థాపించి) మత్స్యకేశ్వర కూర్మేశ్వర మొదలగువారిని సేవించి, తుదకు శివునిచేతిలో మడిసినాఁడు, అశఁడాయనదార్థమైన వాసుదేవుఁడు.

సీ. ఒగి పౌండ్రకుఁడు పుట్టెనో హరి పుట్టెనో
మేటి మీనయి వేల్పుటేటియందు
నొగి పౌండ్రకుఁడు వచ్చెనో హరివచ్చెనో
యట జనించి యగస్త్యు నంజలికిని
నొగిఁ బౌండ్రకుఁడు దెల్పెనో హరి తెల్పెనో
యమ్మునికాత్మజన్మంబు లెఱుఁగ
నొగిఁ బౌండ్రకుఁడు చెప్పెనో హరి చెప్పెనో
మర్త్యంబునం దున్న మహితమహిమ
ఆ. వినసి మత్స్యనాథుచేఁతలు పౌండ్రక
వాసుదేవుమీఁద నైతు రజ్ఞు
లేమిసేయవచ్చునే... ౨౨

టీ. పౌండ్రకుఁడు = పౌండ్రకవాసుదేవుఁడు, హరి = విష్ణుమూర్తి, మేటిమీనయి = పెద్దచేపయయి, వేల్పుటేటియందు = గంగానదియందు, అగస్త్యునంజలికిని = అగస్త్యుని దోసిలిలోనికి, ఆత్మజన్మంబులు=తనపుట్టుకలు, మర్త్యంబునందు = మనుష్యజన్మంబునందున్న, మహితమహిమ=గొప్పమహిమ, మత్స్యనాథుచేఁతలు=మత్స్యావతారునిపనులు.

సీ. పౌండ్రకుండో రమాభర్తయో ముసు వారి
రాశిఁ గూర్మావతారంబు నొందె

పౌండ్రకుండో రమాభర్తయో గంగాప్ర
వాహపావనతీరవాసియయ్యె
పౌండ్రకుండో రమాభర్తయో సన్మునుల్
వినఁగఁ గూర్మపురాణవిధి రచించె
పౌండ్రకుండో రమాభర్తయో యప్పురా
ణమున నీశ్వరుకథ లమరఁ దెల్పెఁ
ఆ. జెనసి కూర్మదేవుచేతలు పౌండ్రక
వాసుదేవుమీఁద వైతు రజ్ఞు
లేమి సేయవచ్చునే... ౨౮

టీ. రమాభర్తయో=లక్ష్మీపతియైన విష్ణుమూర్తియో, వారిరాశిన్ = సముద్రములో, కూర్మపురాణవిధిన్ = కూర్మపురాణక్రమమును, కూర్మదేవుచేతలు = కూర్మావతారుఁడైన విష్ణుమూర్తిచేసినపనులు.

సీ. ఆదివరాహమై యవనిఁ బుట్టినవాఁడు
పంకజనాభుఁడో పౌండ్రకుండో
సుస్థితిగంగాతటస్థుఁడై చనువాఁడు
పంకజనాభుఁడో పౌండ్రకుండో
మును వరాహపురాణమును రచించినవాఁడు
పంకజనాభుఁడో పౌండ్రకుండో
యందీశ్వరాధిక్య మభినుతించినవాఁడు
పంకజనాభుఁడో పౌండ్రకుండో
ఆ. చెనసి యవ్వరాహు చేతలు పౌండ్రక
వాసుదేవుమీఁద వైతురజ్ఞు
లేమి సేయవచ్చునే ౨౯

టీ. ఆది వరాహమై, = మొదటివరాహమై, అవనిన్ = భూమిమీఁద, పంకజనాభుఁడో = విష్ణువో? సుస్థితిన్ = మంచిస్థితితో, గంగాతటస్థుఁడై = గంగానదీతీరమున నుండెనవాఁడయి, ఈశ్వరాధిక్యము = ఈశ్వరుని గొప్పతనము, అజ్ఞులు = తులువలు

సీ. ఎన్నఁటిపౌండ్రకుం డిల నరసింహరూ
పము దాల్చి వలుదకంబమున వెడలె
నెన్నఁటిపౌండ్రకుం డిల శ్రీనగమున నృ
సింహబిలమ్ము రచించియుండె
నెన్నఁటిపౌండ్రకుం డిలను నేనేకాక
పైదైవ మెవఁ డని ప్రల్లదించె
నెన్నఁటిపౌండ్రకుం డిల శరభేంద్రుచే
తలఁ ద్రుంపఁబడి యెత్తి తోలువఁబడియె
ఆ. చెనసి యీనృసింహుచేఁతలు పౌండ్రక
వాసుదేవుమీఁద వైతు రజ్ఞు
లేమి సేయవచ్చునే ...... ౮౦

టీ. ఎన్నఁటి = ఎప్పటి, వలుదకంబమున = విశాలమైన స్తంభమున, శ్రీనగమున = శ్రీశైలమునందు, ప్రల్లదించె = ప్రగల్భములుపలికెనా

సీ. బలిని దాన మడుగఁ బౌండ్రకుండే వామ
నావతారముఁ దాల్చి యటకుఁ బాఱె
నందుఁ ద్రివిక్రముండై పౌండ్రకుండె మీఁ
దికి నొక్కకాలెత్తి కింకలేక
పౌండ్రకుండే వీపుప్రక్కన నరకాలి
తోడఁ దారుద్రుచేఁ ద్రుంపఁబడియె

నెవ్విధిఁ బౌండ్రకుండే మదోన్మత్తుఁడై
మదిమది పెంపున మడిసిపోయె

ఆ. నట్టివామనంబు నలజళ్లు పౌండ్రక
వాసుదేవుమీఁద వైతు రజ్ఞు
లేమిచెప్పవచ్చునే ...... ౮౧

సీ. పౌండ్రకుండే భువి పరశురామునవతా
రముఁ దాల్చి యేకవీరకుని నొంచె
పౌండ్రకుండే యందు భర్గునకుఁ దపంబుఁ
జేసి తచ్ఛుశ్రూషఁ జేయఁగలిగె
పౌండ్రకుండే ఘోరపరశువాదిగ దివ్య
శస్త్రముల్ గాంచె నీశ్వరునిచేత
పౌండ్రకుండే యిల బ్రాహ్మల కిచ్చి వా
రును నుండనీకున్న వనధిఁబడియె

ఆ. నట్టి పరశురాము నలజళ్లు పౌండ్రక
వాసుదేవునిమీఁద వైతు రజ్ఞు
లేమిచెప్పవచ్చునే ...... ౮౨

టీ. ఏకవీరకుని = లోకైకవీరుని, నొంచెన్ = అణఁచెను, భర్గునకు = ఈశ్వరునకై, తచ్ఛుశ్రూషన్ = ఆపని సేవను, పరశువాదిగదివ్యశస్త్రముల్ = పరశువు మొదలయిన దివ్యాస్త్రములు, వనధిఁబడియె = సముద్రములోనుండెను, అలజళ్లు = కంగారుపనులు,

సీ. ఆలిఁ గోల్పడె దండకాటవియందున
పలవరించినవాఁడె పౌండ్రకుండొ
రావణుశక్తికి లక్షణుపాటుకుఁ
బరితాపమొందెనే పౌండ్రకుండొ

రావణున్ జంపిన బ్రహ్మహత్య లభింప
భ్రమితుండు నగువాఁడు పౌండ్రకుండో
రామేశు నిల్పి శ్రీరామేశ్వరమున ని
ష్పాపుఁడై చనువాఁడు పౌండ్రకుండో
ఆ. చెనసి రామచంద్రు చేతలు పౌండ్రక
వాసుదేవుమీఁద వైతు రజ్ఞు
లేమి చెప్పవచ్చునే ... ౨౩

టీ. ఆలిఁగోల్పడి = భార్యను బోఁగొట్టుకొని, రావణుశక్తికి = రావణుఁడు ప్రయోగించినశక్తికి, లక్ష్మణుపాటుకు = లక్ష్మణుఁడుపడిన మూర్ఛపాటునకు, భ్రమితుండు=భ్రాంతినొందినవాఁడు, నిష్పాపుఁడై=పాపములేనివాఁడై, చనువాఁడు = వెళ్లువాఁడు.

సీ. వసుదేవునకుఁ బుట్టివాసుదేవుం డన
పాండవులను గొల్చెఁ బౌండ్రకుండు?
మేఘుమై శివుఁ గొల్చి మెప్పించి సాంబుఁడ
న్పట్టెఁ దాఁగాంచెనే పౌండ్రకుండు?
తనయాలి దనుమును దండినిగట్టరో
పనగట్లు దీసెనే పౌండ్రకుండు?
కట్టైరుకవాటునఁ గాలున నాఁటునఁ
బడి మృతుఁ డయ్యెనే పౌండ్రకుండు?
ఆ. చెనసి యిట్టి కృష్ణుచేతలు పౌండ్రక
వాసుదేవుమీఁద వైతు రజ్ఞు
లేమి చెప్పవచ్చునే ... ౨౪

టీ. గొల్చెన్ = సేవించెను, సాంబుడన్పట్టెన్ = సాంబుడనెడుకొడుకును, పనగట్లు = బిగియఁగట్టినకట్లు, కట్టైరుకవాటున = క్రూరమైన

యెరుకలేదానిప్రేరుచె, నాటునఁబడి = దెబ్బమూలమున, చెనసి = ఉద్రేకించి.

సీ. ఆదిని మత్స్యమై హరిశంభుఁ గొల్చెఁగా
కపౌండ్రకుఁడు మత్స్య మగుట గలదె?
యాదిని కూర్మమై హరిశంభుఁ గొల్చెఁగా
కపౌండ్రకుఁడు కూర్మ మగుట గలదె?
యాదిని క్రోడమై హరిశంభుఁ గొల్చెఁగా
కపౌండ్రకుఁడు క్రోడ మగుట గలదె?
యాదిని రాముఁడై హరి శంభుఁ గొల్చెఁగా
కపౌండ్రకుఁడు రాముఁ డగుట గలదె?

ఆ. కడఁగి యిట్లు విష్ణు కడగళ్లు పౌండ్రక
వాసుదేవుమీఁద వైతు రజ్ఞు
లేమిచెప్పవచ్చునే...... ౮౮

సీ. కాశిలో వ్యాసుండు కరమెత్తి పౌండ్రకు
నే ప్రతిష్ఠించె మీ రెఱుఁగరాక
స్తంభితభుజుఁడై యతండు పౌండ్రకునకే
బిట్టెలుంగున మొఱఁబెట్టుచుండె
భయముతో నచటికిఁ బౌండ్రకుండేవచ్చి
వానికి శివమహత్త్వంబుఁ దెలిపె
పౌండ్రకు విడిచియే భక్తివ్యాసేశ్వరు
నతిభక్తి నిలిపి వాఁ డనఘుఁడయ్యె

ఆ. కడఁగి యిట్టివిష్ణు కడగళ్లు పౌండ్రక
వాసుదేవుమీఁద వైతు రజ్ఞు
లేమిచెప్పవచ్చునే ...... ౮౯

టీ. కరమెత్తి = మిక్కిలి పూని, స్తంభితభుజుండై = కట్టుబడిన చేతులుగలవాఁడై, బిట్టెలుఁగునన్ = పెద్దయెలుఁగుతో, శివమహత్త్వంబు = శివుని గొప్పతనము, అనఘుఁడు = పాపరహితుఁడు.

సీ. ఆది మత్స్యము నిల్ప నట మత్స్యకేశ్వరం
బిల లంకలోపలఁ గలదుగాక
యాదిఁ గూర్మము నిల్ప నాదికూర్మేశ్వరం
బిల నొకవారాశిఁ గలదుగాక
రామచంద్రుఁడు నిల్ప రామేశ్వరము పాల
కొలను సేతువయందె గలదుగాక
కృష్ణుండు నిల్పినఁ గృష్ణేశ్వరంబు పెం
పలవారణాసిలోఁ గలదుగాక
పౌండ్రకుండు నిలుప పౌండ్రకవాసుదే
వేశ్వరంబు గలదె యెచటనైన
నెన్న వేలవేయునే...... ౮౭

టీ. ఆదిమత్స్యము=తొలుతటిమత్స్యవతారుఁడు, నిల్పన్ = ప్రతిష్ఠ చేయఁగా, మత్స్యకేశ్వరంబు = మత్స్యకేశ్వర మనుక్షేత్రము, వారాసిన్ = సముద్రములో, పాలకొలను = పాలకొల్లు, (ఇది పంచారామములోని శ్రీరామము టఇ రామలింగేశ్వరుఁడు ప్రతిష్ఠింపఁబడినవాఁడు- సేతువయందు = వానరులచే నిర్మింపఁబడిన సేతువునందు, వారణాసిలోన్=కాశిలో, ఎన్నన్ = ఆలోచింపఁగా, వేయునేల = వేయువిషయములు ఎందులకు ?

సీ. భువి శివభక్తప్రభోమమయనియాదిఁ
బల్కినవాఁడు సుపౌండ్రకుండె?
తగదు ఆదుర్భాషితం మహత్త్వని వ్యాసు
భక్తి గలపినవాఁడు పౌండ్రకుండె?

నిగమార్థముగను మాపి గురుమచ్ఛిష్యుని
ప్రతిభజించినవాఁడు పౌండ్రకుండె
యిలను మకర్త మహేశ్వరో యని యీశు
భజియించువాఁడె దాపౌండ్రకుండె ?

ఆ. కడగి యిట్టివిష్ణు కడగళ్లు పౌండ్రక
వాసుదేవుమీఁద వైతు రజ్ఞు
లేమిచెప్పవచ్చునే... ౧౧

టీ. భక్తిప్రభో=భక్తులకు ప్రభువైనవాఁడా? ఆదిన్=తొలుత, దుర్భాషితమ్=చెడుమాట, ఉమాచ = పార్వతియును. గురుమచ్ఛిష్యుని = గురువునువలె శిష్యుని, ప్రతిభజించినవాఁడు=తిరిగి సేవించినవాఁడు, మహేశ్వరః=మహేశ్వరుఁడు, కర్త=చేయువాఁడు. కడఁగినవాఁడు = నేర్చినవాఁడు, నిగమార్థముగ= వేదార్థమగునట్టుగా

సీ. ఆదియుగమున మత్స్యావతారమునాఁడు
మురవైరి మత్స్యేశ్వరు భజింప
నయ్యుగంబునను కూర్మావతారమునాఁడు
దనుజారి కూర్మేశ్వరుని భజింప
నయ్యుగంబున వరాహావతారమునాఁడు
హరి వరాహేశ్వరు నటు భజింప
నయ్యుగంబున నృసింహావతారమునాఁడు
శౌరి నృసింహేశు చేరి కొలువ

ఆ. ద్వాపరంబున నాఁటివానిని పౌండ్రక
వాసుదేవుఁ జెప్పు వాండ్రు నెట్లు
నెడమఁ జేయఁజూతురే... ౧౨

సీ. ఘోషించిన "శివ ఏకో దేవ" యని శ్రుతి
గలుగుట రుద్రుఁ డొక్కరుఁడె కర్త
ధృతి "నేక మేవా ద్వితీయ" మని యనిశ్రుతి
గలుగుట రుద్రుఁ డొక్కరుఁడె కర్త
చెన్నార "నేక పూర్షం రుద్ర" యని శ్రుతి
గలుగుట రుద్రుఁ డొక్కరుఁడె కర్త
నొగి "నేక ఏవ రుద్రోచ్యతే" యని శ్రుతి
గలుగుట రుద్రుఁడొక్కరుఁడె కర్త
ఆ. యని యుగాదులందు హరివిరించాదులు
గొలిచి సత్పథములగొందు రట్లు
నేలపలుకు వేయు నేకామ్ర... ౮౦

టీ. శివ ఏకోదేవః = శివుఁడు ఒక్కఁడే దేవుఁడు=ఏక మేవాద్వితీయమ్, పరబ్రహ్మ ఒక్కటియే,( రెండవవస్తువు లేనిది.). ఏక పూరుషారుద్రః=రుద్రుఁ డొక్కరుఁడే (పరమపురుషుఁడు.) ఏక ఏవరుద్రోఉచ్యతే = రుద్రుఁడుఒక్కఁడే యని చెప్పఁబడుచున్నాఁడు, హరివిరించాదులు = విష్ణువు బ్రహ్మ మొదలగు వారు, కొలిచి = సేవించి, సత్పథములన్ = మంచిమార్గములను, కొందురు = తీసికొందురు.

సీ. తగను"త్వంవిశ్వభర్తాతవనాస్తిభ
ర్తా"యనభర్తతథ్యంబునీవ
అరయ "త్వం విశ్వహర్తా తవ నాస్తి హ
ర్తా" యన హర్త తథ్యంబునీవ
తగిలి "త్వం విశ్వకర్తా తవ నాస్తిక
ర్తా" యన కర్త తథ్యంబు నీవ

తలఁప "త్వాం విశ్వనాథా తవ నాస్తి నా
థా" యన నాథుతథ్యంబు నీవ
ఆ. గాన భర్త హర్త కర్త నాథులు మఱి
లే రటంచు శ్రుతులు లిలమ్రోయ
నేలపలుకు లింక నే... ౧౧

టీ. భర్తా = భరించువాఁడు, త్వంవిశ్వభర్తా = నీవు ప్రపంచమును భరించువాఁడవు, తవ నాస్తి భర్తా = నీకు భర్త లేఁడు, కర్తా = చేయువాఁడు హర్తా = హరించువాఁడు, నాథో = నాథుఁడైనవాఁడు.

సీ. ఇల "జగతాం పతయే నమో నమః" యని
చాటుచు నీశుఁడే సర్వకర్త
యతిశయించి "దిశాంచ పతయే నమో" యని
చాటుచు నీశుఁడే సర్వకర్త
నలరేగి "యోషధీనాం పతయే" యని
చాటుచు నీశుఁడే సర్వకర్త
యింపారఁగా "పశూనాం పతయే" యని
చాటుచు నీశుఁడే సర్వకర్త
ఆ. యని దొడంగి మీకు యజురాదివేదంబు
లర్థి మ్రొక్కుచుండు నట్టినిన్ను
నెన్న నేలవేయు నే... ౧౨

టీ. జగతాంపతయే నమోనమః = జగత్తులకు పతియైన యీశ్వరుని [illegible]అకు నమస్కారము. దిశాంచపతయేనమః = దిక్కుల కధిపతివైన నీకు నమస్కారము. ఓషధీనాంపతయే నమః=ఓషధుల కధిపతివైన నీకునమస్కారము, పశూనాం పతయే నమః=ప్రాణులకధిపతివైన నీకు నమస్కారము, యజు

రాదివేదంబులు = యజుస్సు మొదలయిన వేదములు, అర్థిన్ = ప్రీతితో, మ్రొక్కుచుండున్ = నమస్కరించుచుండును, అట్టినిన్ను ఎన్నసేల = స్తుతింప నేల?

సీ. తవిలి "రుద్రాయాతతావినే క్షేత్ర"ని
చాటుచు శంభుఁడే సర్వకర్త
తగ "గృత్స్నవీతాయ ధావతే" యని పూని
చాటుచు శంభుఁడే సర్వకర్త
నిశ్చయింపఁగ "మంత్రిణే వాణిజాయ"ని
చాటుచు శంభుడే సర్వకర్త
రయెలమి "నిషంగిణయిషుధిమతే" యని
చాటుచు శంభుఁడే సర్వకర్త
ఆ. యని దొడంగి మీకు యజురాదివేదంబు
లర్థి మ్రొక్కుచుండు నట్టినిన్ను
నెన్ననేల వేయునే... ॥3

టీ. తవిలి = పూని, రుద్రాయాతతావినే క్షేత్రాణాంపతయేనమః = రుద్రుఁడు ఎదురుగనుండి యుద్ధముచేయువాఁడు, క్షేత్రములకధిపతియును. మంత్రిణేవాణిజాయ = మంత్రియైనవాఁడు, వ్యాపారముచేయు వాఁడును. నిషంగిణఇషుధిమతే = అమ్ములపొదిగలవాడును, అని యజుర్వేదము మ్రొక్కుచుండుటచే శంభుఁడే సర్వకర్త.

సీ. శ్రుతిఁబూని 'వ్రాతపతిభ్యశ్చ' యని యెత్తి
చాటుచు శర్వుఁడే సర్వకర్త
దృష్టంబుగా 'గణపతిభ్యశ్చ' యని యెత్తి
చాటుచు శర్వుఁడే సర్వకర్త

ప్రేమతో 'విశ్వరూపేభ్యశ్చ' యని యెత్తి
చాటుచు శర్వుఁడే సర్వకర్త
దివ్యంబుగా 'రథపతిభ్యశ్చ' యని యెత్తి
చాటుచు శర్వుఁడే సర్వకర్త
ఆ. యని దొడంగి నిన్ను యజురాదివేదంబు
లర్థి మ్రొక్కుచున్న యట్టినిన్ను
నెన్న నేల వేయునే... ౯౪

టీ. ధృతిఃఋణాని = ధైర్యముపూని, వ్రాతపతిభ్యశ్చ = 'జనసమూహములకధిపతియైనవాఁడు, అని ఎత్తిచెప్పుచు, శర్వుఁడే = ఈశ్వరుఁడే, సర్వకర్త = సమస్తమునకుఁ గర్త, గణపతిభ్యశ్చ = గణముల కధిపతియైనవాఁడు, విశ్వరూపేభ్యశ్చ = సమస్తరూపములుగలవాఁడు, రథపతిభ్యశ్చ = రథాధిపతులస్వరూపమైనవాఁడు.

సీ. తనర "త్వమేవ మాతాచ పితా" యని
యతిభక్తిఁ గొలిచె దివ్యాగమములు
నలి "నన్యథా శరణం నాస్తి" యని సదా
భక్త్యర్థిఁ గీర్తించు మూలాగమములు
తెల్లంబుగా "త్వం గతి స్త్వం మతి శ్చైవ"
యని ప్రశంసించు శైవాగమములు
"దీనాశ్వరతి మంత్రహీనం క్రియాహీన"
మని స్తుతియించు సర్వాగమములు
ఆ. యట్టినీకు సాటియేది శ్రీవేదాంత
వీరభద్రశరణవేషరుద్ర
యుద్ధనిషంగయే... ౯౫

టీ. త్వమేవ మాతాపితాచ = నీవే తల్లివి తండ్రివి, అన్యథా శరణం నాస్తి = మఱియొకవిధమున శరణములేదు, త్వం గతిస్త్వం మతిశ్చైవ = నీవే మాకు గతి నీవే మాకు సద్బుద్ధియైనవాఁడవును, దీనాః = దీనులు, మంత్రహీనమ్ = మంత్రములు లేనివారయ్యును, క్రియాహీనాశ్చ = క్రియలు లేనివారయ్యును, చరంతి = సంచరించుచున్నారు, శ్రీవేదాంతవీరభద్రశరణవేష = వేదాంతస్వరూపుఁడా వీరభద్రావతారమున రక్షచేయువేషముగలవాఁడా, ఇద్ధనిషంగ=అందమైన అమ్ములపొదిగలవాఁడా !

సీ. శ్రీగురవేనమః శ్రీనీలకంఠాయ
శాశ్వతాంగాయ సర్వేశ్వరాయ
శ్రీధరవరదాయ శ్రీవ్యోమకేశాయ
వరదాయుధాయ మద్వల్లభాయ
శ్రీలయనేత్రాయ శ్రీదసన్మిత్రాయ
మద్వంశినే భక్తవత్సలాయ
శ్రీవామదేవాయ శ్రీమహాదేవాయ
శర్వాయ శంభవే శంకరాయ
ఆ. యనెడు నామ్రుదూక్తు లాలింపుమయ్య పా
లింపుమయ్య కృపఁ దలంపుమయ్య
యీఁగదయ్య భక్తి ౯౬

టీ. శ్రీగురవే = శోభాయుక్తుండైన గురుస్వరూపుఁడు, శ్రీనీలకంఠాయ = అందమైన నల్లనికంఠముగలవాఁడు, శాశ్వతాంగాయ = శాశ్వతమైన అవయవములుకలవాఁడు, సర్వేశ్వరాయ = సమస్తమునకు అధిపతియైన వాఁడు, శ్రీవ్యోమకేశాయ = ఆకాశమే జటాజూటముగాఁ గలవాఁడు, వరదాయుధాయ=వరములనిచ్చు ఆయుధములుగలవాఁడు, మద్వల్లభాయ = నాప్రియుఁడైనవాఁడు, శ్రీలయనేత్రాయా=కాలాగ్ని నేత్రముగాఁగలవాఁడు,

శ్రీదసన్మిత్రాయ = సంపద నిచ్చు యోగ్యమైన మిత్రుఁడైనవాఁడు, మదంశినే = నావంశములోనివాఁడు, భక్తవత్సలాయ = భక్తులయందు వాత్సల్యముగలవాఁడు, శ్రీవామదేవాయ = అందమైనదేవుఁడు, శ్రీమహాదేవాయ = గొప్ప తేజోరూపుఁడు, శర్వాయశంభవే=సుఖమునకు ఉత్పత్తిస్థానమైనవాఁడు. శంకరాయ = సుఖమునుచేయువాఁడు నగు ఈశ్వరునకు నమస్కారము.

సీ. తస్మై నమస్స్మృతతాప సంహారిణే
హరి సంహరాయ కాలాంతకాయ
తస్మై నమస్సుధాధవళ దేహాయ త్రి
లోచనాయ భవార్తి మోచనాయ
తస్మై నమః ఫణీంద్ర విభూషణాయ పి
నాకినే పార్వతీనాయకాయ
తస్మై నమో మహీధ్రనికేతనాయ సం
తుష్టచిత్తాయ మృత్యుంజయాయ

ఆ. యనెడు నామృదూక్తు లాలింపుమయ్య పా
లింపుమయ్య కృపఁ దలంపుమయ్య
యీఁగదయ్య భక్తి యే ౯౭

టీ. స్మృతతాపసంహారిణే = స్మరింపఁబడినంతనే. తాపమును సంహరించునట్టి, తస్మై = ఈశ్వరుని కొఱకు, నమః = నమస్కారము, సుధాధవళదేహాయ = సుద్దవలె తెల్లనయినదేహము కలవాఁడు, త్రిలోచనాయ = మూడునేత్రములుగలవాఁడు, భవార్తిమోచనాయ=సంసారపీడను విడిపించువాఁడు, ఫణీంద్రవిభూషణాయ = సర్పరాజములు భూషణముగాఁగలవాఁడు, పినాకినే = పినాకమను ధనుస్సుగలవాఁడు, పార్వతీనాయకాయ = పార్వతికి భర్తయైనవాఁడు, మహీంధ్రనికేతనాయ = కైలాసపర్వతము స్థానముగాఁగల

వాడు. సంతుష్టచిత్తాయ = సంతోషించినమనస్సుగలవాడు, మృత్యుంజయాయ = మృత్యువును జయించినవాడు.

సీ. ఇష్టదాయ బ్రహ్మణే లింగమూర్తయే
మత్పతయే ఓం నమశ్శివాయ
నస్పృహాయ జ్వాలనస్తంభరూపిణే
మత్పతయే ఓం నమశ్శివాయ
యుగ్రాయతే ప్రళయోత్పత్తిహేతవే
మత్పతయే ఓం నమఃశివాయ
మహితశాంతాయాది మధ్యాంతశూన్యాయ
మత్పతయే ఓం నమశ్శివాయ
యనెడు నామ్రుదూక్త ... ౮౯

టీ. ఇష్టదాయ = ఇష్టమైనవాని నిచ్చువాడు, బ్రహ్మణే = బ్రహ్మస్వరూపుడైనవాడు, లింగమూర్తయే = లింగాకారమైనవాడు, మత్పతయే = నాకు ప్రభువైనవాడు, ఓం = ఓంకారస్వరూపుడు. అగుశివాయ = శివునికొఱకు, నమః=నమస్కారము, నస్పృహాయ = విషయములందు అభిలాషలేనివాడు. జ్వాలస్తంభరూపిణే = అగ్నిని స్తంభించినస్వరూపముగలవాడు, ఉగ్రాయ = భయంకరమైన రూపముగలవాడు, ప్రళయోత్పత్తిహేతవే = నాశనమునకు పుట్టుకకు కారణమైనవాడు, మహితశాంతాయ = పూజ్యమైనవాడు. శాంతమైనవాడు, ఆదిమధ్యాంతశూన్యాయ = ఆదిమధ్యము అంతములేనివాడు. అగు శివునకు నమస్కారము,

సీ. దుష్కర్మహార శివదో శివదో పాల
కురికి సోమేశ నిర్గుణనాశ తెలంగ:
దురితభంజనశివదో పాల
కురికి సోమేశ త్రిగోప్రకాశ

దుష్టమర్దన శివదో శివదో పాల
కురికి సోమేశ నిర్గుణప్రకాశ
దోషఖండన శివదో శివదో పాల
కురికి సోమేశలఘు ప్రకాశ
ఆ. యనెడు నామ్రుదూక్తు లాలింపుమయ్య పా
లింపుమయ్య కృపఁ దలంపుమయ్య
యీఁగదయ్య భక్తి యే ... ౯౯

టీ. దుష్కర్మహర=పాపకర్మమును హరించువాఁడా! దురితభంజన = పాపములను భేదించువాఁడు, త్రిగోప్రకాశ = మూఁడువేదములందును ప్రకాశించువాఁడా! దుష్టమర్దన = దుష్టులను హింసించువాఁడా ! నిర్గుణప్రకాశ=నిర్గుణమైనప్రకాశస్వరూపుఁడా, దోషఖండన=దోషములను ఖండించువాఁడా! లఘుప్రకాశ = విశేషమయిన తేజోరూపుఁడా పాలకురికి గ్రామవాసియగు సోమేశా నామ్రుదూక్తులాలింపుమయ్యా,

సీ. శివదో మహాదేవ శివదో సదాశివ
శివదో శివాధిప శివదో శివదో
శివదో మహేశ్వర శివదో గిరీశ్వర
శివదో మయామయ శివదో శివదో
శివదో జగన్నాథ శివదో మదాత్మేశ
శివదో భవాంతక శివదో శివదో
శివదో విరూపాక్ష శివదో సురాధ్యక్ష
శివదో నతాపేక్ష శివదో శివదో
ఆ. యనెడు నామ్రుదూక్తు లాలింపుమయ్య పా
లింపుమయ్య కృపఁ దలంపుమయ్య
యీఁగదయ్య భక్తియే...లింగ. ౧౦౦

సీ. కాలభుజంగమాభీలతగడియ నీ
క్షించి తలంకెద శివదో శివదో
మోహశార్దూలంబు ముట్టినఁ బోలేక
చేడ్వడి వగచెద శివదో శివదో
క్రోధాగ్నికణములు కొని కాలనేనోడి
చేతుల్విదల్చెద శివదో శివదో
శిథిలజరారాక్షసీభూతకోటఁ బెం
చిననేఁ గలంగెద శివదో శివదో
ఆ. ఆడు నామృదూక్తు లాలింపుమయ్య పా
లింపుమయ్య కృపఁ దలంపుమయ్య
యీఁగదయ్య భక్తియే... ౧౨౧

టీ. కాలభుజంగమాభీలతన్ = మృత్యువనెడి సర్పముయొక్క భయం కరరూపమును, ఈక్షించి=చూచి, తలంకెదన్= భయపడెదను, మోహశార్దూలంబు=మోహమనెడిపెద్దపులి. ముట్టినన్ = మీఁదపడఁగా, పోలేక, చేడ్పడి= పాదయి,వగచెదన్=బాధపడెదను. క్రోధాగ్నికణములు = కోపమనెడి అగ్ని యొక్క తునుకలు, కాలన్‌గొని=కాళ్లతో నెత్తి, నేను ఓడి = వ్యాకులచిత్తుఁ డనై, చేతులు విదల్చెద=చేతుల నిటునటుచిమ్ముదును. శిథిలజరారాక్షసీభూత కోటన్=శిథిలావస్థను గూర్చెడి ముసలితనమనురాక్షసి భూతమైకోటను, పెం చినన్ = వృద్ధిసేయఁగా, నేను, కలంగెదన్ = కలఁతచెందెదను. నాఁడు =- ఆనాఁడు, నామృదూక్తులుఆలింపుమయ్య

సీ. శివదో యబద్ధకుక్షిని బెంపనే కాని
దేవ మిమ్ము భజింపఁ దెరువు లేదు
శివదోయసత్యులచెంత నుండనె కాని
జియ్య మీభక్తులఁ జేర లేదు

శివదో కుజనగోష్ఠిచేఁ దలంపనే కాని
తండ్రి మీశివగోష్ఠి తగులలేదు
శివదో పరస్తుతుల్ చేసి క్రుంగెదఁ గాని
స్వామి మీమహిమయు చదువలేదు
ఆ. యనెడునామృదూక్తు లాలింపుమయ్య పా
లింపుమయ్య కృపఁ దలంపుమయ్య
యీఁగదయ్య భక్తియే... ౧౦౨

టీ. అబద్ధకుక్షిని = అసత్యమైనపొట్టను, పెంపనేకాని = పెంచుటకే కాని. తెరువు=ఉపాయము, అసత్యులచెంతన్=అసత్యము మాటాడువారిదగ్గర, కుజనగోష్ఠిచే = దుష్టులతో మాటాడుటచే, శివగోష్ఠిన్=శివుని ప్రసంగమున.

సీ. సంసార మనునింద్రజాలంబులో మున్గి
చిక్కి భీతిల్లెద శివదో శివదో
అడియాస యనువేడి బెడిదంపునులిఁబడి
చింతలొందెద మది శివదో శివదో
పాపంబు చిక్కనఁబడి వెలువడలేక
చిడిముడిపడుచుంటి శివదో శివదో
భవపాశములఁగట్టుపడి తెంపులేక మ్రు
చ్చిలి వెచ్చనూర్చెద శివదో శివదో
ఆ. యనెడు నామృదూక్తు లాలింపుమయ్య పా
లింపుమయ్య కృపఁ దలంపుమయ్య
యీఁగదయ్య భక్తియే... ౧౦3

టీ. సంసారమనెడి యింద్రజాలంబులో = గారడీలో, భీతిల్లెద = భయపడెదను, అడియాస = చెడు ఆశ, బెడిదంపునులిఁబడి = కఠినమైన సొలఁ

త్రిప్పఁబడి, చింతలొందెదన్ = వ్యాకులపడుచుందును, చిడిముడిపడు చుంటిని = చీకాకుపడుచుంటిని, భవపాశములకట్లు=సంసారపాశపుచిక్కులు, తెంపులేక = తెగుటలేక, ముచ్చిలి = దొంగిలింపఁబడి, చిచ్చునార్చెదన్= వేడినిట్టూర్పులువిడిచెదను.

సీ. భావింపరానివి భావింపఁగోరుదు
నింక నాదురితంబు లెన్నఁ డణఁగు
చూడంగరానివి చూడఁగాఁ గోరునే
నిడుదృష్టి దోషంబు నెన్నఁ డణఁగు
చేయంగరానివి చేయంగ నూహింతు
నేఁగర్మదుర్దశ లెన్నఁ డణఁగు
ప్రసరింపరానివి ప్రసరింపఁగాఁ బోదు
నిఁక పాపబంధంబు లెన్నఁ డణఁగు
ఆ. నెన్నఁ డబ్బునాకు నెట్లు పావన మౌదు
భక్తి గురుకృపాప్రభావమహిమ
హేతుశుద్ధిమహిమ యే... ౧౦౮

టీ. భావింపరానివి = ఆలోచింపఁ గూడనివి, భావింపఁగోరుదున్= ఆలోచింపఁగోరెదను, దురితంబులు = పాపంబులు, ఇడుదృష్టిదోషంబులు = ప్రసరింపఁజేయు దృష్టియందలిదోషములు, కర్మదుర్దశలు = కర్మవలనిదుర వస్థలు, ప్రసరింపరానివి = తాఁకరానివి, ప్రసరింపఁగాఁబోదును = తాకఁ బోయెదను, పాపబంధములు = పాపసంబంధములు, (ఎన్నఁడబ్బునాకుభక్తి) గురుకృపాప్రభావమహిమన్ = గురువుయొక్క కృపామహిమచేత నెట్లు, పావనమౌదున్ = పవిత్రమగుదును? హేతుశుద్ధిమహిమ=కారణశుద్ధియొక్క గొప్పతనము.

సీ. రక్షింపవే కృపవీక్షింపవే సుమా
ర్గముఁ జూపి పెడగుమార్గములు మాపి
కావవే కలికాల బ్రోవవే సద్భక్తి
గలిగించి శత్రువర్గము లణంచి
త్రెంపవే సత్క్రియల్ దింపవే దుర్మతి
జంపవే రాగాదిసంచయములు
బోధింపవే భక్తి వేధింపవే బాధ
గాథలు మెలఁగి విరోధ మణఁపి
ఆ. యనెడి నాప్రభావ మాలింపుమయ్య పా
లింపుమయ్య కృపఁ దలంపుమయ్య
యీఁగదయ్య భక్తియే... ౧౦౫

టీ. కృపవీక్షింపవే = దయతో చూడవా ? సుమార్గము = మంచి మార్గము, పెడగుమార్గము = పెడత్రోవ, మాపి = నశింపఁజేసి, సత్క్రియల్ = పుణ్యకర్మలు, దుర్మతిన్ = దుర్బుద్ధిని, దింపవే = తగ్గింపవా? రాగాదిసంచయంబు = రాగద్వేషాదిదోషసముదాయము, బాధన్ = పీడను, వేధింపవే = పోఁగొట్టవా?

సీ. ఇలఁదేనెఁబడి చెడ్డ యీఁగచందంబున
నొగిరాగమగ్నత నున్నవాఁడ
పాలలోపలఁబడ్డ బల్లిచందంబున
నుదితమహోద్వృత్తి నున్నవాఁడ
నలినూతిలోఁబడ్డ యెలుకచందంబున
బహుకడగండ్లచేఁ బరగువాఁడ

నీరులోపలఁబడ్డ నేయిచందంబున
గుఱిలేని బాధలఁ గుందువాఁడ

తే. నన్నుఁ జూడుమయ్య నాపేదవెతకు యా
లింపుమయ్య కృపఁ దలంపుమయ్య
యోగదయ్య భక్తియే... ౧౦౬

టీ. క్షితిన్ = భూమియందు, లేనెఁబడ్డయోగ చందంబునన్ = తేనెలోఁ బడ్డ యోగవిధమున, రాగమగ్నతన్ = అనురాగములో మునుఁగుటతో, సుపిత్తమహోద్వృత్తిన్ = బయలుదేఱిన గొప్ప ఉద్రేకముతో, నీరులోఁబడ్డ నేయిచందంబున = నీటిలోఁపడిన నేయివలె, గుఱిలేని = అంతులేని, బహుకడ గన్నష్టచే = అనేక ఆపదలచే, వగుచువాఁడన్ = ఒప్పెడువాఁడను, నాపేద వెతకు = యినాదీనమయినబాధతోఁగూడిన మొఱ్ఱ.

సీ. నీయందు సద్భక్తి నిష్ఠ లేమిక నున్న
బాధించుచున్న యాపదలు సాక్షి
నీదుపాదోదకనిష్ఠ లేమిక నున్న
గాఱించుచున్న రోగములె సాక్షి
నీప్రసాదామృత నిష్ఠ లేమిక నున్న
దట్టించుచున్న దుర్దశలు సాక్షి
నీభక్తదాసోహనిష్ఠ లేమిక నున్న
నలయించుచున్న కర్మముల సాక్షి

తే. యని నిజంబు పలుకుసట్టి నాపేదకు
యాలింపుమయ్య గదయ్య జయ్య
యోగదయ్య భక్తియే... ౧౦౭

టీ. భక్తినిష్ఠలేమి = యోగ్యమయినభక్తియొక్క నిష్ఠలేకపోవుటచే. పాదోదకనిష్ఠ లేమి = పాదజలమును తీసికొనునియమము లేకపోవుటచే. బాధించుచున్న = బాధపెట్టుచున్న, నీప్రసాదామృతనిష్ఠలేమి = నీప్రసాదమను అమృతమునొక్క నిష్ఠలేకుండుటచే, దుర్దశలు = దురవస్థలు, నీభక్తదాసోహనిష్ఠ = నీభక్తులకు దాసుడననుబుద్ధి, అలయించుచున్న = పీడించుచున్న.

సీ. ఎలమి వేదాంతవీరేశ్వరబిరుదాంక
ములు వ్రాయు పుస్తకమో యనంగ
ప్రమథులమహితానుభావముల్ పెక్కుచం
దములఁ జెప్పినపురాణమొ యనంగ
కీర్తింప బసవేశుగీతాదు లటులవ్రా
యింపఁ గల్గినరుద్రవీణ యనఁగ
పాల్కురికయ్య ప్రబంధంబు లన్నింటిఁ
బెట్టినయొడికంపు పెట్టె యనఁగ
ఆ. నమరఁ శరణుజిహ్వాలం దన్యవాదకో
లాహలంబు సుధవిలాస మగుచు
వెందు వెలయుఁగాక నే... ౧౦౮

టీ. ఎలమిన్ = సంతోషముతో, వేదాంతవీరేశ్వరబిరుదాంకముల్ = వేదాంతప్రతిపాద్యుడైన వీరేశ్వరునియొక్క బిరుదచిహ్నములు, ప్రమథులమహితానుభావముల్ = ప్రమథగణము పూజ్యప్రభావములు, బసవేశుగీతాదులు = బసవేశ్వరునిపాటలు మొదలయినవి, పాల్కురికయ్య = పాల్కురికి సోమనాథుని, ప్రబంధంబులు = ప్రబంధములలోనివిషయములు, శరణుజిహ్వాలందు = శివభక్తులజిహ్వలలో, అమరుక = అమరుగాక. సుధవిలాసము = అమృతమునొక్క విలాసముగలదై.

సీ. ధర్మార్థులకు దానధర్మసంపత్తియు
నర్థార్థులకు సంగామితార్థములను
ఆయురర్థులకు దీర్ఘాయుసమృద్ధియు
మోక్షార్థులకు శుద్ధమోక్షపథము
రాజ్యార్థులకును సామ్రాజ్యసంపత్తియు
జ్ఞానార్థులకును సుజ్ఞానములును
యోగార్థులకు బహుయోగాభివృద్ధియు
మోక్షార్థులకు శుద్ధమోక్షపథము
ఆ. నొసఁగు నెవ్వరేని యిది వ్రాసి చదివిన
నీసళత మతివిశేషముగను
నేల కలుగకుండు నేకామ్రగురుచిత్త
నలినభృంగ సోమనాథలింగ. ౧౦౯

టీ. ధర్మార్థులకు = ధర్మము గోరువారికి, అర్థార్థులకు = ధనమును గోరువారికి, ఆయురర్థులకు = ఆయుర్దాయము గోరువారికి, పుత్రార్థులకు = పుత్రులను గోరువారికి, యోగార్థులకు = చిత్తనిరోధమును గోరువారికి. మోక్షార్థులకు = మోక్షముగోరువారికి. శుద్ధమోక్షపథము = నిర్మలమైన మోక్ష మార్గము

అన్యవాదకోలాహలము సంపూర్ణము.

---

చెన్నపురి, వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.

# పద్యకావ్యములు

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| అడవిమల్లెలు | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము | .. | 2 | 0 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము | ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము | ... | 0 | 10 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 6 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆది సభాపర్వములు ,, | ... | 4 | 0 |
| ఆరణ్యపర్వము .. | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు,, | ... | 4 | 0 |
| శాంతిపర్వము ,, | ... | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 4 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 11 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము—జనమంచి శేషాద్రిశర్మగారిది 3 సంపుటములు | ... | 15 | 0 |
| డిటో 7 ,, | ... | 18 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| గరుడాచలము-యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 3 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము | ... | 0 | 4 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము | ... | 1 | 12 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | ... | 1 | 8 |
| చెన్నపురీవిలాసము | | 0 | 8 |
| చెన్నబసవపురాణము | ... | 2 | 8 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) | ... | 2 | 0 |
| జైమినీభారతము | ... | 2 | 8 |
| తెనుఁగుసమస్యలు | ... | 0 | 3 |
| దసరాపద్యములు | ... | 0 | 2 |
| దశావతారచరిత్ర | ... | 3 | 0 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | ... | 0 | 8 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | ... | 0 | 10 |
| నలోపాఖ్యానము. సటీక | ... | 0 | 8 |
| నిర్వచనోత్తరరామాయణము | ... | 1 | 8 |
| నలచరిత్ర, ద్విపద, క్యాలికోబైండు | ... | 2 | 4 |
| నిరంకుశోపాఖ్యానము | ... | 0 | 8 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము | ... | 0 | 8 |
| పల్నాటివీరచరిత్రము | ... | 3 | 8 |
| పంచతంత్రము, నారాయణకవిది | ... | 1 | 8 |
| డిటో క్యాలికోబైండు | ... | 2 | 0 |
| డిటో వేంకటనాథ రాజకవికృతము | ... | 1 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 2 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము | ... | 1 | 12 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | ... | 1 | 0 |
| ,, సాంధ్రటీకాతాత్పర్యము | ... | 3 | 0 |

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| భాస్కరరామాయణము | ... | 8 | 0 |
| భక్తిరసశతకసంపుటము I (26) శతకములు | ... | 3 | 0 |
| ,, II ,, | ... | 3 | 0 |
| ,, III ,, | ... | 3 | 0 |
| నీతిశతకసంపుటము I ,, | ... | 3 | 0 |
| మల్లభూపాలీయము. నీతిశతకము, ఎలకూచి బాలసరస్వతిది, టీకా | | 1 | 0 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద ముద్రితము | ... | 5 | 0 |
| మార్కండేయపురాణము | ... | 3 | 0 |
| మొల్లరామాయణము | ... | 1 | 8 |
| యయాతిచరిత్ర, పొన్నిగంటి తెలగనార్య | ... | 1 | 0 |
| యయాతిచరిత్ర, అకొండి వ్యాసమూర్తి | ... | 0 | 3 |
| రత్నపరీక్ష, సాంధ్రతాత్పర్యము | .. | 0 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద | . | 6 | 0 |
| రంగరాయచరిత్రము | ... | 0 | 12 |
| రాఘవపాండవీయము, సటీక | . | 4 | 0 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 6 |
| రామరాజీయము | ... | 0 | 12 |
| రామాభ్యుదయము | .. | 2 | 0 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | ... | 1 | 8 |
| వసుచరిత్రవిమర్శనము | ... | 1 | 4 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద | ... | 1 | 4 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.